1. కృష్ణో౽ స్యాఖరేష్ఠో౽గ్నయే త్వాజుష్టం ప్రోక్షామి వేదిరసి
బర్హిషే త్వాజుష్టాం ప్రోక్షామి బర్హిరసి స్రుగ్భ్యస్త్వాజుష్టం ప్రోక్షామి

ఇంధనమా! నీవు తృణసమృద్ధ ప్రదేశమున ఉన్న శుష్క కాష్టమవు. నీవు అగ్నికి ప్రియమవు. నిన్ను జలముచే పవిత్రము చేయుచున్నాను. (దర్భల కూర్చతో నీరు చల్లవలెను.)

(వేది మీద దర్భచే నీరు చల్లి పవిత్రము చేయవలెను)

వేదీ! నీవు సకల లాభములు సమకూర్చు వేదివి. దర్భకు ప్రీతి కలిగించు నిన్ను పవిత్రము చేయుచున్నాను.

దర్భా! నీవు బర్హివి. స్రువములకు ప్రీతి కలిగించుదానవు, నిన్ను పవిత్రము చేయుచున్నాను.

2. ప్రోక్షించగా మిగిలిన జలమా! నీవు నేలను తడి చేయుదానవగుము.

దర్భా! నీవు విష్ణువు శిఖా వృంతము నుండి వచ్చినదానవు. ఉన్నితో మృదువగు కంబళము చేసి నిన్ను వేది మీద పరచెదను.

వేదీ! నీవు దేవతలకు సుఖాసన స్థానమవు. (హోమము చేయునపుడు బయటపడిన హవిరన్నము తాకి) అగ్ని యొక్క ప్రథమ భ్రాత భువపతి కొరకు ఈ హవి ఆహుతి కావలెను. అగ్ని ద్వితీయ భ్రాత భువపతి కొరకు ఈ హవి ఆహుతి కావలెను. అగ్ని ద్వితీయ భ్రాత భువపతి కొరకు ఈ హవి ఆహుతి కావలెను. అగ్ని తృతీయ భ్రాత భువపతి కొరకు ఈ హవి ఆహుతికావలెను.

3. ప్రథమ పరిధీ! విశ్వావసు గంధర్వా! అన్ని విధముల అహింసల నిమిత్తము నీవు పరిధిని ఆహవనీయపు పశ్చిమ దిశన స్థాపించుము. పరిధీ! నీవు యజమాని రక్షాపరిధివి.

భువపతి అగ్నీ! నీవు స్తుత్యుడవు. అందువలన హోత మున్నగు వారిచే సంస్తుతింపబడుము.

దక్షిణ పరిధీ! నీవు ఇంద్రుని దక్షిణ భుజమవు. అన్ని హింసల సమాప్తికిగాను నిన్ను ఆహవనీయపు దక్షిణ భాగమున స్థాపింతును. నీవు యజమానికి కూడా రక్షణ పరిధివి.

అగ్నికి ద్వితీయ భ్రాతవగు భువపతీ! నీవు స్తుత్యుడవు. అందువలన హోత మున్నగు వారిచే సంస్తుతింపబడుము.

ఉత్తర పరిధీ! మిత్రావరుణులు స్థిర ధారణ ద్వారా నిన్ను ఉత్తరమున స్థాపింతురు గాత. నీవు యజమానికి సహితము రక్షణ పరిధివి.

అగ్నికి తృతీయ భ్రాతవగు భ్రాతపతీ! నీవు స్తుత్యుడవు. అందువలన హోత మున్నగు వానిచే సంస్తుతింపబడుము.

4. (అగ్ని హోమమున సమిధలు వేయుచు) ఆహవనీయ అగ్నీ! క్రాంతదర్శీ! నీవు దేవతల పానగోష్ఠిని సంపన్నము చేయువాడవు. ద్యుతిమంతుడవు. మహామహుడవు. మేము యజ్ఞమున హోమము చేయుదుము. సమిధలచే నిన్ను ప్రజ్వలితుని చేయుదుము.

5. (రెండవ సమిధ వేయుచు) సమిధే! నీవు సమిధవు తూర్పు దిక్కున నీకు ఎట్టి హింస జరుగకుండ సూర్యుడు రక్షించును గాత.

దర్భలారా! మీరు సూర్యుని బాహువులగుదురు. ఉన్ని యొక్క మృదువైన కంబళమున మిమ్ము వేదిపై పరుస్తాను. మీరు దేవతలు సుఖాసీనులగు సాధనములు.

పరచిన దర్భాసనమా! వసువులు, రుద్రులు, ఆదిత్యులు విచ్చేసి నీపై ఆసీనులు కావలెను.

**'ఆత్వా వసవో రుద్రా ఆదిత్యాః సుదన్తు'**

6. జుహువా! నీవు ఘృతము పోయుదానవు. 'జుహువు' అను పేరు గల దానవు. దేవతలకు ప్రియమగు ఘృత సహితవై దర్భాసనమున స్థిరపడుము.

హవీ! నీవు దేవతలకు ప్రియ తేజమగు ఘృత సహితవై దర్భాసనమున నిలువుము.

(యజ్ఞ సామగ్రిని తాకి) హవిస్సులన్నియు యజ్ఞ భూమియగు వేది మీద స్థిరపడినవి. విష్ణూ! నీవు ఈ హవిస్సులను అసురులనుండి రక్షింపుము. యజ్ఞమును రక్షింపుము. యజ్ఞపతిని రక్షించుము. అధర్వుడనగు నన్ను రక్షింపుము.

"ధృవా అసదనృతస్య యోనౌ తావిష్ణోపాహి పాహి యజ్ఞం పాహి యజ్ఞపతిం పాహిమాం యజ్ఞన్యమ్"

7. హవిరన్న విజేతా అగ్నీ! హవిరన్నమునకు నమస్కరింతును. దానిని పవిత్రము చేయుదును. నీకు సమర్పింతును. (ఉత్తర దిశకు చేతులు జోడించి) దేవతలకు వందనము. (దక్షిణ దిశకు చేతులుజోడించి) పితృ దేవతలకు నమస్కారము. (జుహువు, ఉపభృతములను చేతితో ఎత్తి) ఈ రెండును పూర్తిగా నా అధీనమున ఉండవలెను.

"నమోదేవేభ్యః స్వభాపితృభ్యః సుయమే మే భూయాస్తమ్"

8. నేడు నేను చెదిరి ఇటునటు పడిన హవిరన్నమును మరల దేవతలకు సమర్పిస్తాను. యజ్ఞ దేవతా! పొరపాటున సహితము నిన్ను నేను దాటకుందును గాత.

అగ్నీ! నీ ఛాయ ధనమయము. దానినే నేను ఆశ్రయింతును.

యజ్ఞ ప్రదేశమా! నీవు విష్ణువునకు స్థానమవు. ఇచట నుండియే ఇంద్రుడు తన పరాక్రమము ప్రకటించినాడు. అప్పటినుండియే హింసారహిత యజ్ఞము తలెత్తినది.

9. అగ్నీ! నీవు అగ్ని హోత్రమవని ఎరుంగుము. నీ దూతత్వమును ఎరుంగుము. దూత కార్యము నిర్వహించునపుడు ద్యావాపృథ్వులు నిన్ను రక్షించును గావుత. నీవు సహితము ద్యావాపృథ్వులను రక్షింపుము.

ఇంద్రుడు హవి, ఘృతములందు ప్రీతి కలవాడు. అతడు శుభములు కలిగించవలెను. యజ్ఞమును పూర్తి చేయించవలెను. ఇది ఇంద్రుని కొరకైన ఆహుతి, జ్యోతి జ్యోతితో కలసిపోవలెను.

"సంజ్యోతిషాజ్యోతిః"

10. (ప్రధానయాగము ముగిసినంత మిగిలిన పురోడాశము భక్షించునపుడు యజమాని పఠించవలసినది)

ఇంద్రా! ఈ హుతశేషము భక్షించుట వలన నా ఇంద్రియ బలము వృద్ధి యగును గాత. మాకు ఇంద్రుని ధనముతో సాంగత్యము కలుగును గాత. మా ఆశయములు ఫలించును గాత. అభిలాషలు తీరును గాత.

నేను పృథ్విని పిలుచుచున్నాను. పృథ్వి నన్ను పిలువ వలెను. నేను అగ్నినై శేష పురోడాశమును భక్షించుచున్నాను.

"ఆహంతు అగ్నిహిసన్ భక్షయామి" అని ఉవటుడు. "స్వాహాసుహుతమస్తు జఠరాగ్నే' అని మహీధరుడు.

నరుని యందు జఠరాగ్ని ఉన్నది. కావున నరుడు అగ్నిఅయినాడు. జఠరాగ్నిలో ఇది చక్కగా హుతమగునుగాత. అన్నము జీర్ణమైననేగదా బలము- ప్రాణము!

11. నేను ధ్యౌష్పిత నన్ను పిలువవలెను. నేను అగ్నిని అగుదును. అగ్నీధ్రుని చేత పురోడాశ శేషము భక్షింతును.

పురోడాశ శేషమా! నేను సవితృ దేవత ఆజ్ఞానువర్తిని. ఆశ్వినుల బాహువులతో పూషదేవత హస్తములతోను ఈ హుత శేషమును పట్టినాను.

పురోడాశ శేషమా! నేను నిన్ను అగ్నిముఖముగనే భక్షింతును.

12. ద్యోతమాన సవితా! ఈ యజ్ఞపు యాజమాని నిన్ను భజించుచున్నాడు. బృహస్పతిని బ్రహ్మను భజించుచున్నాడు. కావున నీవు యజ్ఞమును రక్షించుము. యజ్ఞస్వామియగు యజమానిని రక్షింపుము. ఋత్విజుడనగు నన్ను రక్షింపుము.

13. సవిత మనోవేగము కలవాడు. అతడు ఈ ఆహుతి యందలి ఘృతమును స్వీకరించవలెను. బృహస్పతి. ఈ యజ్ఞము హింసితము కాకుండ చేయవలెను. అతడు స్వయముగా ఈ యజ్ఞమును భరించవలెను.

ఈ యజ్ఞమున విశ్వేదేవతలు ఆనందించవలెను. ఆ దేవతలందరు యజ్ఞము సఫలమగునట్లు ఆశీర్వదించవలెను.

14. అగ్నీ! ఇది నీ కొరకైన సమిధ. దానిచే నీవు పూర్తిగా ప్రజ్వలితుడవగుము. యజమానాదులను వర్ధిల్లచేయుము.

మేము ఋత్విజులము. మేము వర్ధిల్లుదుము యజమానాదులను వర్ధిల్లచేయుదుము.

అగ్నీ! నీవు హవిరన్నము మీదకు ఎగబడువాడవు. హవిరన్నమును జయించిన వాడవు. నిన్ను నేను పవిత్రుని చేయుదును.

15. (ప్రక్కప్రక్కన ఉన్న జుహువును ఉపభృతమును వేరు చేయదలచిన యజమాని జుహువును తూర్పుదిశకు జరిపి)

అగ్ని సోములు స్వర్గాదులను జయించినారు. నేను వారికి అనుకూలుడనగుదును. వాటిని గెలుతును. హవిరన్నము సమర్పించి నేను స్వయముగా జుహువును అగుదును. తూర్పునకు జరుగుదును.

అగ్నిసోములారా! మమ్ము ద్వేషించువారిని- మేము ద్వేషించువారిని తొలగించండి. అన్నము పెట్టియే నేను ఈ శత్రువును తొలగింతును.

ఇంద్రాగ్నులు నా కొరకు స్వర్గాదులను గెలిచినారు. నేను వారికి అనుకూలుడనగుదును. వాటిని సాధింతును.

(ఉపభృతమును పడమటికి జరిపి) హవిరన్నము సమర్పించి స్వయముగా ఉపభృతమునై పడమటికి జరుగుదును. మమ్ము ద్వేషించువారిని- మేము ద్వేషించువారిని ఇంద్రాగ్నులు తొలిగించవలెను. హవిరన్నము సమర్పించియే నేను నా శత్రువును తొలగింతును.

16. (పశ్చిమ, ఉత్తర, దక్షిణ పరిధులను జుహువుచే ఘృతమున తడుపుచు యజమాని)

పశ్చిమ పరిధీ! వసువుల కొరకు నిన్ను ఘృతమున తడుపుదును. దక్షిణ పరిధీ! రుద్రుల కొరకు నిన్ను ఘృతమున తడుపుదును. ఉత్తర పరిధీ! ఆదిత్యుల కొరకు నిన్ను ఘృతమున తడుపుదును.

(ప్రస్తరము -రెండు మూడు దర్భలు కలసినది - అందుకొని) ద్యావాపృథ్వులారా! మీరు నా ప్రస్తర గ్రహణమును ఆమోదించండి. ప్రస్తరము ధరించిన యజమానీ! మిత్రావరుణులు వర్షము కలిగించి నిన్ను రక్షింతురు.

(ప్రస్తమునును నేతిలో ముంచి) ఘృతము నిండిన ప్రస్తరమును నాకి గాయత్రి మున్నగు ఛందస్సులు పక్షిరూపమున ద్యులోకమునకు చేరవలెను. ప్రస్తరమా! నీవు యాగయోగ్యగోవువు అగుము పృథ్వివి ఆగుము. ద్యులోకమునకు చేరుము. అటనుండి మాకు వర్షము కలిగించుము.

అగ్నీ! నీవు నేత్రపాలకూడవు. నా నేత్రములను సురక్షితముగా ఉంచుము.

చక్షుష్పాఽగ్నేఽసి చక్షుర్మేపాహి.

17. ఆహవనీయ అగ్నీ! పక్షుల ద్వారమున దాచి నీవు పశ్చిమ పరిధిని స్థాపించినావు. ఆ పరిధిని నేను ప్రీతి పూర్వకముగ అగ్నికి సమర్పింతును. అది నీ కన్న దూరమున పడరాదు. అగ్నికి ప్రియమగు అన్నము ఆ పరిధికే లభించవలెను. (మంత్రము చదివి పశ్చిమ, దక్షిణ, ఉత్తర పరిధులను అగ్నికి అర్పించవలెను)

(పరిధి = యజ్ఞార్హ్యమైన మేడిచెట్టు పుల్ల. హోమాగ్నికి రక్షణగా నాలుగు వైపుల పరచబడి ఉండును)

18. విశ్వ దేవతలారా! మీరు 'సంస్రవ' భాగము గలవారు. అయినను మీరు హవిరన్నవంతులు కావున మహామహులు. మీలో కొందరు దర్భాసమున ఆసీనులగువారు. కొందరు పరిధులందు ఉండువారు. మీరందరు నేను చేయుచున్న ఈ స్తుతిని స్వీకరించండి. మీరు ఈ దర్భాసనము మీద ఆసీనులు కండు. హవిని అందుకొనండి. ఆనందించండి. ఇదిగో ఇది విశ్వ దేవతలకు ప్రత్యక్ష ఆహుతి - ఇది పరోక్ష ఆహుతి.

(సంస్రవము - ఆహుతులు వేయునపుడు చెదిరి పడిన హవిరన్నము)

19.జుహూ, ఉపభృతములారా! మీరిద్దరు ఘృతమును సమర్పించువారు. (వానిని హవిర్ధాన శకటమున ఉంచవలెను.) మీరు బండికి కట్టిన రెండు ఎద్దులను విపత్తుల నుండి రక్షించండి మీరు ఇద్దరు సుఖ స్వరూపిణులు. మీరు నన్ను స్వర్గాది సుఖములందు నిలుపండి.

యజ్ఞమా! నీకు వందనము. (యజ్ఞ క్రమమున అధిక కృత్యములు జరిగియున్న మన్నించుము) యజ్ఞక్రమమున ఏవైన లోపములు జరిగిన వానిని పూరించుము. నీవు అభీష్ట యజ్ఞపు సుసమాప్తి వరకు నిలిచి ఉండుము. యజమానినగు నా శుభములందు నిలిచి ఉండుము.

20. అగ్నీ! నీవు యజమానివి. అహింసనీయుడవు. సర్వభక్కువు. సర్వ వ్యాపకుడవు. నీవు నన్ను అశనిపాతము నుండి రక్షింపుము. మృత్యుబంధమునుండి రక్షింపుము. దుఃఖకర దృష్టి నుండి రక్షింపుము. అనుచిత ఆహ్వానములనుండి రక్షించుము. నా అన్నమును విష రహితము చేయుము. నన్ను సుఖప్రదమగు గృహమున ఉంచుము.

ఇదిగో ఇది అగ్నీ కొరకు ప్రత్యక్ష ఆహుతి. ఇది అప్రత్యక్ష ఆహుతి. సంవేధ అధిదేవతకు ఇదిగో ఆహుతి. యశోభాగిని సరస్వతికి ఆహుతి. "సరస్వత్యై యశోభోగిన్యైస్వాహా"

(సంవథ - పతీపత్నులు పడుకొను శయ్య)

21. (యజమాని భార్య దర్భముష్టిని పట్టుకొనును)

దర్భముష్టే! నీవు జ్ఞాన స్వరూపవు. నీవు దేవతలను కనుగొన్న దానవు. కావున నాకు జ్ఞాన స్వరూపమవగుము.

యజ్ఞజ్ఞాతలగు దేవతలు యజ్ఞగానము చేసి ఇట నుండి స్వర్గమునకు చేరుకొనవలెను.

మనస్సునకు దేవతవగు చంద్రుడా! నీవు ఈ యజ్ఞమును వాయువునులీనము చేయుము. ఇది చంద్రుని ఆహుతి.

22. ఆదిత్యులు - వసువులు - మరుత్తులు - విశ్వేదేవలతో ఏకత్వముగల వాడు ఇంద్రుడు. అతడు దర్భను, హవిని ఘృతమున ముంచవలెను. ఘృతమున మునిగిన దర్భ సూర్యుని చేరవలెను.

23.(యజమాని ప్రణీతను వేదికకు దూరముగా కొనిపోవుచు)

ప్రణీతా! నిన్ను కర్మ విముక్తను చేయువాడెవ్వడు? ఆ ప్రజాపతియే నీకు యజ్ఞ విముక్తి కలిగించును. అతడు ఎవరి కొరకు నిన్ను విముక్తను చేయునో వారికొరకే నిన్ను విముక్తను చేయును. నేను నిన్ను సంతానాదుల పోషణ కొరకు

విముక్తను చేయుదును.

కృష్ణాజినము మీద చెదిరిపడిన పురోడాశా కణములారా! మీరు రాక్షసుల భాగము. వారు అందుకొందురు గాత. "పోషాయ రక్షసాంభోగ్యోసి"

(ప్రణీతము - చమసపాత్రమందలి జలము. వండిన పదార్థములు)

24. త్వష్టా! మేము బ్రహ్మవర్చస్సు, పాడి, పుత్రాదులు, శుభములు, సుమనస్సు గలవారము కావలెను. సమృద్ధి ప్రదాత త్వష్ట మాకు ధనములను ప్రసాదించవలెను. మా దేహపు వంకలను సరిదిద్దవలెను.

25. యజ్ఞదేవత జగతీ ఛందోరూపుడై ఒక పాదము భూమి మీద పెట్టినాడు. అప్పుడే మమ్ము ద్వేషించువారును మేము ద్వేషించువారును, నిర్భాగ్యులైనారు. త్రిష్టుప్ ఛందో రూపమున విష్ణువు అంతరిక్షమున రెండవ పాదము వేసినాడు. అప్పుడే మమ్ము ద్వేషించువారును, మేము ద్వేషించువారును అంతరిక్షమున నిర్భాగ్యులైనారు. గాయత్రీ ఛందోరూపుడగు విష్ణువు మూడవ పాదమున భూలోకమును ఆక్రమించినాడు. అప్పుడే మమ్ము ద్వేషించువారును, మేము ద్వేషించువారును భూలోకమున నిర్భాగ్యులయినారు. ఈ విధముగా వర్షము, అన్నము ప్రదానము చేయునదియు, దిశా విశేషము కలిగించునదియగు యజ్ఞ భూమి నుండి ఆ దుష్టులు దూరమైనారు.

విష్ణువు దయ వలన స్వర్గము లభించినది. జ్యోతితో ఏకత్వము పొందినాము.

26. సూర్యదేవా! నీవు స్వయంభువుడవు. నిన్ను మరొకరు సృష్టించలేదు. హిరణ్య గర్భనామక్ ప్రధానరశ్మివి. బ్రహ్మవర్చస్సు ప్రదాతవు. నాకు బ్రహ్మ వర్చస్సు ప్రసాదింపుము. నేను సూర్యుడు చేయు ప్రదక్షిణ వంటి ప్రదక్షిణ చేయుదును. (ప్రదక్షిణ చేయవలెను.)

27.గార్హ్యపత్యాగ్నీ! నీవు సమృద్ధ గృహపాలకుడవు. గృహపాలకుడవగు నీ ద్వారా నేను యజమాని యొక్క సమృద్ధ గృహమునకు పాలకుడను అగుదును. గృహపతినగు నాతోపాటు నీవును గృహపతివగుము. మనము ఇద్దరము గృహపాలనాది కార్యములను చక్కగా నిర్వహింతుముగాక. ఒక ఎద్దులాగు బండి కన్న రెండెడ్లు లాగుబండి త్వరగా గమ్యస్థానము చేరును కదా! మన స్నేహము నూరేళ్ళ వర్ధిల్లవలెను. సూర్యుని ప్రదక్షిణ వంటి ప్రదక్షిణనే నేను చేయుదును నూరేళ్లు (ప్రదక్షిణ చేయవలెను)

28. యజ్ఞపాలక అగ్నీ! నేను ఈ యజ్ఞ రూప వ్రతమును ఆచరించ గలిగినాను. విధి పూర్వకముగ దానిని పూర్తి చేయగలిగినాను. ఆ యజ్ఞ ఫల స్వరూపమున నీవు ప్రవేశించుము. యజ్ఞ విసర్జన చేసిన నేను ఇప్పుడు పూర్వపు సాదారణుడను అయినాను. 'య ఏవాస్మిసోస్మి'

29. (దర్శపూర్ణమాస ప్రక్రియ ముగిసినది)

పిత్రృ దేవతలకు కవ్యము వహించు అగ్నికి ఆహుతి. పిత్రృయుక్త సోమునకు ఆహుతి వేదిపై కూర్చుండు అసుర, రాక్షసాదులు దూరమైనారు.

౩౦. బహురూపములు దాల్చి పితరుల 'స్వధ'ను భక్షించి జీవించువారును - స్థూల, సూక్ష్మ రూపములు ధరించు వారును అగు అందరు అసుర, రాక్షసాదులను అగ్ని ఈ యజ్ఞ ప్రదేశము నుండి తరిమి కొట్టినాడు.

31. పితరులారా! రండి, ఈ పిండ స్థలమున వినోదించండి. మీరందరు- ఆబోతువలె మీ మీ భాగ పిండములను భక్షించండి. పితరులు ఆనందించినారు. ఆబోతు వలె వారు స్వేచ్ఛగా తమ పిండములను ఆరగించినారు.

32. (ఆరు ఋతువులను ఆరుగురు పితరులుగా భావించబడినది. యజమాని ఆరుమారులు నమస్కరించవలెను)

పితరులారా! రసభూత వసంతమున మీకు నమస్కరింతును. పితరులారా! శోషింపచేయు గ్రీష్మమున మీకు నమస్కరింతును. పితరులారా! జీవనదాత యగు వర్షర్తువున మీకు నమస్కరింతును. పితరులారా! అన్న పాచన శరద్రుతువున మీకు నమస్కరింతును. పితరులారా! ఘోర స్వరూపయగు హేమంతమున మీకు నమస్కరింతును. పితరులారా! దాహకారక శిశిర ఋతువున మీకు నమస్కరింతును.

పితరులారా! మీకు నమస్కారము. నమస్కారము. పితరులారా! మీరు మాకు స్త్రీ, పుత్రాదులను ప్రసాదించండి. పితరులారా! ఇంట అన్నాదులు ఉన్నకదా మీకు పిండాదులు అర్పించకలుగునది! కావున మాకు అన్నాదులు ప్రసాదించండి. పితరులారా! ఈ వస్త్రము ధరించండి. (దారము సమర్పించవలెను)

33. పితరులారా! కమలమాలికలు ధరించిన అశ్వినుల వంటి పుత్రులను నా గృహమున పురుష సంఖ్య పూరించునట్లు నా భార్య గర్భమున ప్రవేశపెట్టండి.

34. జలమా! అన్నము, అమృతము, ఘృతము, దుగ్ధము, రసము, సుర వహించి స్వధా స్వరూపమవగుము. మా పితరులను తరింపచేయుము. (జలదానము చేయవలెను.)

దాశరథి రంగాచార్య విరచిత

శ్రీమదాంధ్ర వచన శుక్ల యజుర్వేద సంహితయందలి

రెండవ అధ్యాయము సమాప్తము.

సర్వేపి సుఖినస్సంతు.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతం |
ఆధారస్సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ||

మూడవ అధ్యాయము

1.సమిధాగ్నిం దువస్యత ఘృతైర్బోధియతాధిమ్ |
ఆస్మిన్హవ్యా జుహోతన |

ఋత్విజాదులారా! సమిధ సమర్పించి అగ్నికి పరిచర్య చేయండి. అగ్ని అతిథి సముడు అతనికి ఘృతపు ఆహుతులు అర్పించండి. ప్రజ్వలితుని చేయండి. ప్రజ్వలిత అగ్నిలో చరుపురోడాశాది హవ్యములను హోమము చేయండి.

2.ఋత్విజులారా! అగ్ని సర్వ విధ ప్రదీప్తుడు. జాతవేది. అతనికి అతి రుచికర శుద్ధ ఘృతమును సమర్పించండి.

3. అగ్నీ! నిన్ను సమిధలు, ఘృతాదులచే ప్రవృద్ధుని చేయుదుము. నీవు నిత్య యవ్వనుడవు. కావున చక్కగా వర్ధిల్లుము. ప్రదీప్తుడవగుము.

4. అగ్నీ! ఘృతమున తడిసిన హవిర్యుక్తమగు ఈ సమిధ నిన్ను చేరవలెను. నీవు తేజస్వివి. నేను సమర్పించిన ఈ సమిధలు నీకు ప్రీతి పూర్వకములు కావలెను. నిన్ను సేవించవలెను.

5. అగ్నీ! భూమి, అంతరిక్షము, దేవలోకమను మూడు లోకములందు వ్యాపించినవాడవు. పృథివీ! నీవు దేవతల యజన యోగ్యమవు. శ్రేష్ఠ అన్నములు లభించుటకు గాను నీ వీపు మీద అన్నభక్షక గార్హపత్యాది అగ్నులను స్థాపింతును.

6. ఈ అగ్ని ప్రత్యక్షముగా దర్శనమిచ్చువాడు, యజ్ఞము కొరకు గాను ఇతడు యజమాని ఇంట జ్వాలారూపము ధరించి నిలిచినాడు. స్వర ప్రకారముల ఆహవనీయ గార్హపత్య, దక్షిణాగ్ని స్థానములందు కాలు మోపినాడు. అట్లే పూర్వదిశన పృథ్విని చేరినాడు. ఆదిత్య రూపమున పితరులను చేరినాడు.

7. ఈ అగ్ని ప్రాణాపాన కార్యములు నిర్వహించుచు శరీరపు మధ్య భాగమున వర్తిల్లును. ఇది జఠరాగ్నియగును. శరీరమున జీవన రూపియగును. ఆ విధముగా అగ్ని వాయు, సూర్య రూపమున సమస్త లోకములను అనుగ్రహించును. అతడు యజ్ఞానుష్ఠానము కొరకు ప్రకాశితుడగును.

8. ముప్పది ముహూర్తరూప స్థానములందు శోభిల్లునట్టి పూజ్య వాక్కు అగ్ని కొరకు ఉచ్చరించవలెను. నిత్య ప్రియ స్తుతులు ఉచ్చరించయోగ్యమగు వాణియే శ్రేష్ఠకర్మములందు అగ్నిని స్తుతించును. (ఇవి అగ్న్యాధేయ మంత్రములు)

9. అగ్నియే జ్యోతి జ్యోతియే అగ్ని. కొరకే ఈ ఆహుతి. సూర్యుడే జ్యోతి. జ్యోతియే సూర్యుడు. అతని కొరకే ఈ ఆహుతి. అగ్నియే బ్రహ్మ వర్చస్సు. బ్రహ్మ వర్చస్సే అగ్ని అతని కొరకే ఈ ఆహుతి. సూర్యుడే బ్రహ్మ వర్చస్సు. బ్రహ్మ వర్చస్సే సూర్యుడు. అతని కొరకే ఈ ఆహుతి. జ్యోతియే సూర్యుడు. సూర్యుడే జ్యోతి. అతని కొరకే ఈ ఆహుతి. "జ్యోతిః సూర్యః సూర్యోజ్యోతిః స్వాహా"

10. సవితృ దేవుని సహితముగ సమాన ప్రీతి గలవాడు అగ్ని ఇంద్రవతి రాత్రి సహితముగ సమాన ప్రీతి గల వాడు అగ్ని. అతనికి హవి సమర్పించుచున్నాము. అతడు సేవించవలెను. అగ్ని ఈ ఆహుతిని స్వీకరించవలెను. అగ్నికి స్వాహా.

సవితృ దేవుని సహితముగ సమాన ప్రీతి కలవాడు సూర్యుడు. ఉషా సహిత ఇంద్ర సహిత సమాన ప్రీతి గలవాడు సూర్యుడు. అతనికి హవి సమర్పించుచున్నాము. అతడు సేవించవలెను. సూర్యుడు ఈ ఆహుతిని స్వీకరించవలెను సూర్యునకు స్వాహా.

11. యజ్ఞమునకు విచ్చేసిన వాడును- దూరమందున్నను మా విషయము ధ్యానమునందుంచు కొను వాడునగు అగ్ని కొరకు ఈ సుత్తిని ఉచ్చరించు చున్నాము. దూరమందుండియు అతడు వినును. "ఆరే అస్మేచ శృణ్వతే"

12. ఆహవనీయాది వేదస్థుడగు అగ్ని ద్యులోకపు శీర్షమంతటి ఉన్నతుడు. అతడు ఈ పృథ్వికి ప్రభువు. ఇతడు జలములందలి సారమునకు కర్త.

13. ఇంద్రాగ్నులారా! మీ ఉభయులను కలిపి ఆహ్వానించుచున్నాను. ఉభయులు కలసి ప్రసన్నులు కావలెనని వరించుచున్నాను. మీరిద్దరు అన్నముల, ధనముల దాతలు. అన్నలాభము కొరకు మీ ఉభాయులను ఆహ్వానించుచున్నాము.

14. ఆహవనీయ అగ్నీ! ఈ ముందు కనిపించుచున్నది గార్హపత్యాగ్ని. ఇదియే నీకు ఉత్పత్తి స్థానము. ఇచట పుట్టి నీవు దేదీప్యమానుడవగుచున్నావు.

అగ్నీ! నీ ఉత్పత్తి స్థానమును తెలియుము. గార్హపత్య వేది మీద వెలుగుము. మాకు ధనాది అభివృద్ధిని ప్రసాదించుము.

15. ఋత్విక్కులు అగ్ని మూలమున దేవతలను ఆహ్వానింతురు. అగ్ని యజనీయతముడు, సర్వ యజ్ఞములందు స్తుత్యుడు. అట్టి అగ్ని ముఖ్యునిగా స్థాపించబడినాడు. అతడు స్పృహణీయుడు. వ్యాపకుడు. యజమాని గృహమున ఆహవనీయాది రూపముల విరాజితుడు. అట్టి అగ్నిని అందుకొనుటకే భృగు గోత్రజులు సమిధలు అర్పించి అగ్నిని పూర్తిగా ప్రజ్వరిల్ల చేసినారు.

16. అగ్ని పరిశుద్ధుడు. అతనిలో పురానిహిత దీప్తులున్నవి. గోవులు అగ్ని స్వరూపులు. అవి సహస్ర ధనములిచ్చును. దేవతలకు ప్రియములగు దుగ్ధములిచ్చును. ఆ గోవులను పాలుపితుకు ఆహీరులు పితుకుచున్నారు.

17. అగ్నీ! నీవు దేహమును పవిత్రముచేయువాడవు. నా దేహమును పవిత్రము చేయుము. నీవు ఆయువును ఇచ్చు వాడవు. నాకు ఆయువు ప్రసాదించుము. నీవు బ్రహ్మ వర్చస్సును ఇచ్చువాడవు. నాకు బ్రహ్మ వర్చస్సును ప్రసాదించుము.

అగ్నీ! నా శ్రీరామున లోపమున్నచో వానిని సరిచేయుము.

"అగ్నే యన్మే తన్వా ఊనం తన్మ ఆపృణయ"

18. అగ్నీ! నీవు ద్యుతియుక్తుడవు. అన్నప్రదాతవు. శత్రుంజయుడవు. బలప్రదాతవు. శత్రువును అణచువాడవు. అహింస్యుడవు.

మేము హవిరన్న యుక్తులము. శత్రువును జయించువారలము. బల సంపన్నులము. సదా అహింసనీయులము.

అగ్నీ! మేము నీకు సమిధాదులు సమర్పింతుము. నూరేళ్ళ వరకు నిన్ను ప్రజ్వరిల్ల చేయుదుము.

స్పృహణీయరాత్రే! అవినాశ్యులమై మేము నీ యొక్క ప్రాతః కాలపు అందచందాలను దర్శింతుముకాక.

19. అగ్నీ! నీవు సూర్యుని తేజముతోను, ఋషుల స్తవములతోను వర్ధిల్లుచున్నావు. నీవు నీకు ప్రియమగు తేజస్సున అవతరించినావు.

అగ్నీ! నాకు ఆయువు, బ్రహ్మవర్చస్సు, సంతానము, ధనము, అభ్యుదయములచే సాంగత్యము కలిగించుము - విడిపోకుండునట్లు!

సమహమాయుషా సం వర్చసా సం ప్రజయా సంరాయ స్పోషేణ గ్మిషీయ

20. గోవులారా! మీరు దుగ్ధాది అన్నములు గలవారు. నాకు మీ యొక్క దుగ్ధాది అన్నలాభము కలుగవలెను. మీరు పాలు, పెరుగు,నేయి వంటి దశతేజోవంతులు. నాకు మీ యొక్క పాలు పెరుగు, నేయి వంటి దశతేజో లాభము కలుగవలెను. మీరు బలస్వరూపిణులు. నాకు మీ బలపు లాభము కలుగవలెను. మీరు ధనమునకు సృష్టిభూతులు. నాకు ధనపుష్టి లాభము కలుగవలెను.

21. గోవులారా! మీరు ధనవంతులు. ఈ యజ్ఞపు గోదూహన స్థానమున ఆనందించండి. ఇచటనే ఉండండి. దూరము పోకండి. "ఇహైవస్త మాప గాత"

22. (గోవును తాకి) గోవూ! నీవు యజ్ఞకార్య నిమగ్నవు. వివిధ రూపములు గలదానవు. నీవు బలము, గోపతిత్వ రూపమున నాలో ప్రవేశింపుము - నన్ను బలవంతుని గోపతిని చేయుము.

రాత్రి పూట కాపురముండు అగ్నీ! మేము నిత్యము నిన్ను స్తుతులతోసంస్తుతింతుము. హవిరన్నము అర్పింతుము. నిన్ను మాలో చేర్చుకుందుము.

23. యజ్ఞములందు శోభిల్లువాడు, సత్య సంరక్షకుడు, దేదీప్యమానుడు, గార్హ్యపత్యాది యజ్ఞ గృహములందు సదా వర్ధిల్లు వాడగు అగ్నిని ఆహ్వానించుచున్నాము.

24. అగ్నీ! తండ్రి కొడుకు విషయమునందువలె, నీవు మాకు శుభములు కలుగు ఉపాయవంతుడవు అగుము. మాకు నాశము లేకుండునట్లు మాతో స్నేహము చేయుము.

25. అగ్నీ! నీవు మాకు దగ్గరి దేవతవు, రక్షకుడవు. మాకు శుభంకరుడవగుము. మాకు గృహపతివగుము. నీవు ధనస్వరూపుడవు, ధనదాతవని విఖ్యాతుడవు. అభిముఖడవగుము. మాలో వ్యాపింపుము. మాకు అత్యంత ప్రకాషవంతమగు సువర్ణాది ధనమును ప్రసాదించుము.

26. ప్రవృద్ధ జ్వాలావంత అగ్నీ! నీవు దేదీప్యమానుడవు. నా మిత్రుల కొరకు నిన్ను ధనము యాచించుచున్నాను. మమ్ము నీవారినిగా భావింపుము. మా ఆహ్వానమును గ్రహించుము. మమ్ము సమస్త హింసక వర్గము నుండి రక్షింపుము.

27. ఇళా! విచ్చేయుము. దేవమాత అదితీ! విచ్చేయుము. మీరిద్దరు భజించదగినవారు. విచ్చేయండి. మా కోరికలు తీర్చండి.

28. బృహస్పతీ! నీవు సోమాభిషవకర్తవు. సోమయాజివి. నిన్ను స్తుతించువారికి ఉశిపుత్ర కక్షీవంత ఋషి వంటి వాడవు. మమ్ము కరుణించుము.

("కక్షీవాన్నా మకమృషిం దీర్ఘతమః పుత్రం యథాసోమయాగయుక్తం సుత్తియుక్తంచ కృతవానసి తథా మాం కురు" అని ఉవటుని వ్యాఖ్య. కక్షీవంతుడు దీర్ఘతముని పుత్రుడు. అతడు తండ్రిని సోమయాగయుక్తుని, స్తుతియుక్తుని చేసినాడు. అట్లె నన్ను చేయమని బృహస్పతిని ప్రార్థించుచున్నాడు. ఉశిక కక్షీవంతుని తల్లి)

29. అగ్ని ధనవంతుడు. రోగనాశకుడు, ధనప్రాపకుడు. అన్నాదులందు పుష్టి పెంచువాడు. క్షిప్రకారి. అతడు మమ్ము కూడవలెను.

30. మంత్ర రక్షక బృహస్పతీ! అదాతలగువారి నిందలు, హింసల నుండి మమ్ము రక్షింపుము. మమ్ము కాపాడుము.

31. మిత్ర, ఆర్యమ వరుణులు ముగ్గురు మహామహుల ద్యుతియుక్త ధనవంతము మరియు దుష్ట ధర్షణల రక్షణలు మాకు కలుగవలెను.

32. ఆ ముగ్గురు దేవతల రక్షణలందున్న యజమాని సుఖముగా ఇంట ఉండును. బహుళ మార్గములందు దొంగలు బందిపోటులు అతనిని బాధించరు. పాపియగు శత్రువు అతని మీద ఆధిపత్యము చేయడు.

33. ఆ ముగ్గురు అదితి పుత్రులు. మానవుల జీవనార్థము నిరంతరము జ్యోతిని ప్రసాదించువారు.

34. ఇంద్రా! నీవు ఎన్నటికి హింసకుడవు కావు. హవిర్దాత యజమానిని మరల మరల కలసి కొందువు. నీవు ఇచ్చు అధికాధిక దానము అతనికి అందుచునే ఉండును.

35. సవితది వరణీయ తేజము. దానిని మేము ధ్యానింతుము. అతడు మా బుద్ధులను అనుకూలము చేయవలెను.

36. అగ్నీ! నీ రథము దుర్దమనీయము. దాని వలననే నీవు యజమానులను రక్షింతువు. అట్టి రథము మాకు సంప్రాప్తము కావలెను.

బృహదుపస్థానము సమాప్తము.

37. సచ్చిదానందస్వరూప అగ్నీ! నీ దయ వలన నేను ఉత్తమ సంతానము కలిగి సంతానవంతుడను కావలెను. సువీరులవలన వీరులు గల వాడను, అన్నాది పోషకుల వలన సుపోషకుడను కావలెను.

ఆహవనీయాగ్నీ! మానవహితకరా! నీవు నా సంతానమును రక్షింపుము.

స్తుత్యగార్హ్వపత్యాగ్నీ! నా పశువులను హింసారుల నుండి రక్షింపుము.

స్థిర దక్షిణాగ్నీ! నా ధాన్యమునాకు నష్టముకలుగనట్లు రక్షింపుము.

38. సర్వ ధన ప్రాపకూడును - మాకు ధనము అందించు అభిలాషగలవాడును ఆహవనీయ అగ్ని మాకు లభించినాడు. సర్వమునకు అధిపతివగు అగ్నీ! సువర్ణాది ధనము సాధించుటకును శత్రువును ఓడించుటకును సరిపడు బలమును ప్రసాదించుము.

39. ఈ గార్హ్వా పత్యాగ్ని మా గృహపతి అగును. ఇతడు మా సంతానమునకు ధనము అందించువాడగును. గార్హ్వాపత్యాగ్నీ! సువర్ణాది ధనము సాధించుటకును - శత్రువును ఓడించుటకును సరిపడు బలమును ప్రసాదించుము.

40. దక్షిణాగ్ని పశువులకు హితకరుడు. ధనవంతుడు. అన్నాదులను వర్ధిల్లచేయువాడు.

పశుహితకర దక్షిణాగ్నీ! సువర్ణాది ధనము సాధించుటకును శత్రువును ఓడించుటకును తగిన బలమును ప్రసాదించుము.

41. గృహములారా! భయపడకండి. కంపించకండి. మీరు అన్నము గలవారు. మేము తప్పక మిమ్ము చేరుకొందుము. అన్నము పట్టుకొని, ప్రసన్నమనమున సద్బుద్ధితో ఆనందమయులమై మరల మీలో ప్రవేశించగలము.

42. విదేశములందున్నప్పుడు ఎడతెగక గుర్తు వచ్చు గృహము- ఆనందములు నిండిన గృహమునే మేము ఆహ్వానించుచున్నాము. గృహమా! మమ్ము గుర్తింపుము. మాకు స్వాగతము పలుకుము.

43. ఈ ఇంట గోవులు తిరిగినవి. మేకలు - గొర్రెలు సంచరించినవి. ఈ ఇంటనే అన్నము రసవంతమైనది. నీరు మధురమైనది. అట్టి గృహమున సుఖము, శాంతి కలుగుటకు ప్రవేశించుచున్నాను. మాకు ఈ ఇంట సుఖములు, శుభములు కలుగవలెను. భయములు దూరము కావలెను.

"క్షేమాయ వః శాంత్యై ప్రపద్యే శివం శగ్మం శంయోః శంయోః"

ఉపస్థాన మంత్రములు సమాప్తము.

చాతుర్మాస్య మంత్రములు

(చాతుర్మాస్య యాగమున నాలుగు యాగములుండును)

1. వైశ్వ దేవము 2. వరుణ ప్రఘాసము 3.సాక మేధము 4. శునాసీరీయము

44. మరుత్తులు, వరుణ ప్రఘాసయాగమున ప్రఘాస నామక హవిరన్నమును భక్షించువారు. హింసకులగు బందిపోటుల నాశకులు. యవమయ హవిరన్నమునందు ప్రీతి గలవారు.

అట్టి మరుత్తులను మేము ఆహ్వానించుచున్నాము.

45. మరుత్తులారా! మేము గ్రామమున పాపములు చేసినాము. అరణ్యమున పాపములు చేసినాము. సభలందు పాపము చేసినాము. ఇంద్రియ లోలులమై పాపములు చేసినాము. ఏవేవో అశేష పాపములు చేసినాము. వానినన్నింటిని ఈ చాతుర్మాస్య యాగము చేసి వదిలించుకుందుము.

మరుత్తులకు స్వాహా

46. ఇంద్రుడు దేవతలతో యుద్ధము చేసినపుడు విడివడిన హవిరంశము అతని కొరకై ఉండనే ఉన్నది. ఇది సేచన సమర్థుడగు ఇంద్రుని కొరకగు యవసమార్జిత మహాహోమకర్మము.

హవిర్యుక్త పవమానస్తుతి మరుత్తులను నుతించును.

47. పత్నిచే పిలిపించుకొనుట సుఖకరము. అట్టి సుఖకరమగు వచనములతో ఋత్విక్కులు కర్మ నిర్వహించినారు. యజ్ఞము సంపూర్ణము చేసినారు.

దేవతల కొరకు యజ్ఞము పూర్తి చేసిన ఋత్విక్కులారా! మీరందరు కలసి ప్రస్థానము చేయండి.

48. అవభృతయాగమా! నీవు అత్యంత గతిశీలవు. అట్లయ్యు నీ గతి మందగించును. అట్టితరి నీ ద్వారముననే నేను దేవతల విషయమున చేసిన పాపములను దేవతలచేతనే మన్నింపచేసికొన్నాను మానవుల విషయమున చేసిన పాపములను ఋత్విక్కులచే మన్నింపచేసికున్నాను.

ఇంద్రదేవా! ఇది సకల దుఃఖములు కలిగించు లోకము. దానినుండి నన్ను రక్షింపుము.

49. దర్వీ! నీవు స్థాళి యందలి అన్నముతో ఇంద్రుని కొరకు సాగుము. అభీష్టఫలమునందుకొని తిరిగి రమ్ము.

శతక్రతు ఇంద్రా! మూల్య వినిమయము వలె మేము అన్నము వర్షముల వ్యాపారము చేయుదుము.

(మేము నీకు హవిరన్నము సమర్పింతుము. నీవు మాకు వర్షము ప్రసాదించుమము అని తాత్పర్యము. ఇది వినిమయమే అగును కదా! వినిమయము వర్తకమగును కదా!)

50. ఇంద్రుడు అనుచున్నాడు:-

యజమానీ! నీవు ముందు నాకు హవిరన్నాము అర్పించుము. తదుపరి నీ కొరకు నేను వర్షము కలిగింతును. నీవు నాకు హవిరన్నము అక్కడ పెట్టుము. నేను నీకు వర్షము ఇక్కడ ఉంచుదును.

యజమాని అనుచున్నాడు:-

ఇంద్రా! నీవు వర్షమను సరుకును తెచ్చి ఇమ్ము. దాని మూల్యముగా నీకు హవిరన్నము అందింతును.

"ఇంద్రాయ స్వాహా"

51. పితరులు పిండములు భక్షించినారు. ఆనందించినారు. తలలు ఊపినారు.

ఇంద్రా! బ్రాహ్మణులు స్వయందీప్యమానులు - "స్వభానవో విప్రా' వారు నవీన స్తుతులచే నిన్ను నుతించినారు. ఇహ లెమ్ము, రథమునకు హర్యశ్వములను కట్టుము. "యోజాన్విన్ద్రతే హరీ"

52. మఘవా! నీవు సుదర్శనీయుడవు. నీకు వందనము. సంస్తుతించబడిన నీవు ప్రదానము చేయు సరుకులు నింపి యజమానిని చేరుము. "యోజాన్విన్ద్రతే హరీ"

53. మానవ ప్రశంసక స్తవములు చదివి - అన్యగతమైన మా మనస్సును మాలోనికి ఆహ్వానించుచున్నాము. పితరులను స్తుతించు స్తవములతోనూ మా మనమును మాలోనికి ఆహ్వానించుచున్నాము.

(మనసే స్వాధీనమందున్న సమస్యలు చాలావరకు తీరును)

54. యజ్ఞము, బలము, జీవనము కొరకు మా మనసు మరల మాలో చేరవలెను. చిరకాలము సూర్యుని దర్శించుటకు సహితము మా మనసు మరల మాలో ప్రవేశించవలెను.

55. పితరులారా! దేవతలు మరల మా మనసును మాకు ఇవ్వవలెను. వారు మాకు మరల ఇచ్చిన మనసుతో మేము మా భార్యాపుత్రులతో చేరగలము.

56. సోముడా! నీకుగాను అభిషవాది కర్మలు నిర్వర్తించుటకును శరీరమున మనము నిలువ వలసి ఉన్నది. పుత్రాది సంతానయుక్తులమగుటకు సహితము మనసు నిలుచుట అవసరమై ఉన్నది.

57. రుద్రుడా! ఈ అతిరిక్త పురోడాశము నీ హవిరంశము. దానిని అంబికా సహితుడవై ఆరగింపుము. రుద్రాయ స్వాహా. ఇది నీ హవిరన్నము. మూషికము నీ పశువగును.

58. త్ర్యంబక రుద్రునకు వేరుగా భోజము చేయింతుము. అతడు ప్రసన్నుడు కావలెను. మమ్ము వర్ధిల్లు నివాసవంతుని చేయవలెను. వర్ధిల్లు యశోవంతుని చేయవలెను. సర్వకార్య సమర్థులను చేయవలెను.

59. రుద్రదేవా! నీవు స్వయముగా ఓషధి స్వరూపుడవు. మా గోవులు, అశ్వములు, మానవుల కొరకు వైద్యులను ప్రసాదించుము. ఆడ, మగ మేకలకు సుఖము ప్రసాదించుము.

60. త్ర్యంబకుడు సుగంధయుక్తుడు. అన్నాదులకు సమృద్ధి కలిగించువాడు. అతనిని మేము భజింతుము. పక్వమయిన ఖర్జూర ఫలము వలె మమ్ము మృత్యు బంధము నుండి విముక్తులను చేయుము. అమృతత్వము నుండి మాత్రము కాదు.

త్ర్యంబకుడు సుగంధయుక్తుడు, భర్తలను కూర్చువాడు. అతనిని మేము భజింతుము పక్వమయిన ఖర్జూర ఫలము వలె కన్యలను వివాహమైనంత పితృ గృహము నుండి విముక్తలను చేయుము. కాని పతి గృహము నుండి ఎన్నటికి విముక్తలను చేయకుము.

61. రుద్ర దేవా! ఈ అతిరిక్త పురోడాశము నీకు మార్గ భోజనము -చద్దిమూట. దానిని తీసికొనుము. సాగుము. దూరము - మంజు పర్వతము కూడ - దాటి తరలిపొమ్ము. నీ పినాకపు నారిని దింపుము. పినాకమునే చద్దిమూట చేసికొనుము. గజ చర్మము ధరించుము. మమ్ము బాధించక కళ్యాణమూర్తివై అటుగా సాగిపొమ్ము.

62.రుద్ర దేవా! జమదగ్ని మూడు ఆయువులు, కశ్యపుని మూడు ఆయువులు, దేవతల మూడు ఆయువులు మాకు సహితము కలిగింపుము.

(బాల్య, యవ్వన, వార్ధక్యములు మూడు ఆయువులు అగును)

63. (ముండన సమయమున కత్తిని ఉద్దేశించి)

కత్తీ! నీవు "శివము" అను పేరు  గలదానవు. నీ తండ్రి వజ్రమగును. నీకు నమస్కారము నీవు మమ్ము బాధించకుము

హింసించకుము.

మంగలి అనుచున్నాడు:-

యజమానీ! నేను నీకు ఆయుష్యము, పాచకత్వము, ప్రజోత్పాదకత్వము, ధన సమృద్ధి, సంతానప్రాప్తి, మంచి బలము కలుగుటకు గాను ముండనము చేయుచున్నాను.

**దాశరథి రంగాచార్య విరచిత**
**శ్రీమదాంధ్ర వచన శుక్ల యజుర్వేద సంహితయందలి**
**మూడవ అధ్యాయము సమాప్తము.**
**సర్వేపి సుఖినస్సంతు.**

**జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం |**
**ఆధారస్సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ||**

## నాలుగవ అధ్యాయము

1. ఏదమగన్మదేవ యజనం పృథివ్యా యత్ర దేవసో అజుషన్త విశ్వే |
   ఋక్సామాభ్యాం సంతరన్తో యజుర్భీరాయసోష్షేణసమిషా మదేమ
   ఇమాఆపః శముమేసన్తుదేవీఃఓషధేత్రయాస్వ స్వధితేమైన అహింసీః

యజమాని అనుచున్నాడు:-

భూమిమీద దేవతలను పూజించుచోటు యజ్ఞస్థలము. మేము అచటికి చేరుకున్నాము. అచట విశ్వేదేవతలు ఎంతో ప్రియముగా వానిని ఆరగింతురు. మేము ఋక్కులు, సామగానములు, యజ్ఞవిధానమును బోధించు ఋషి వాక్యములచే కర్మపారావారమును దాటుదుము. అందువలన మాకు ధన సమృద్ధి కలుగవలెను. వర్షము కలిగి మాకు ఉల్లాసము కలిగించవలెను.

(ముండనము చేయునపుడు తలతడుపునీటిని చేతతీసికొని)

ఈజలము ముండవ కార్యమున శుభంకరమగును గాత.

(నీటితో తలను తడిపి వెంట్రుకలు, కుశలను ఒక్కచో చేతపట్టి)

దర్భే! నీవు ఈబాలకుని రక్షింపుము. వజ్రపత్రఛురమా! నీవు ఈబాలుని- ముండన సమయమున- బాధింపకుము.

2. (స్నానము చేయునపుడు నది మున్నగు వానిలో ప్రవేశించిన యజమాని)

మాతృవాత్సల్యముగల శీతలజలము మమ్ము పరిశుద్ధులను చేయవలెను. ఘృతము వలె పవిత్రము చేయుజలము స్వశక్తితో మమ్ము పవిత్రులను చేయవలెను. ద్యుతి మంతమగు ఈజలము శరీరపు సకల మాలిన్యములను ఆత్మకు సంబంధించిన పాపములను కడిగివేయవలెను.

(స్నానము చేసిన తరువాత)

జలము నన్ను పరిశుద్ధుని చేసినది. జలము నుండి బయటికి వచ్చినాను.

(ధోవతిని చేత పట్టుకుని)

ధోవతీ! నేను కర్మమునందు ప్రవృత్తుడనగు దీక్షను - కర్మము వలన కష్టములను నీవు సహించుమూర్తివి. కళ్యాణ కారివి. సుఖప్రదాయినివి. నా శరీరపు శుభవర్గమును ద్విగుణీకృతము చేయుటకు గాను నిన్ను ధరించుచున్నాను. (ధరించవలెను)

(ఘృతం హి అపాం పరమంతేజః పవిత్రం చ అని ఉవటుడు. ఘృతమే జలమునకు పరమ తేజము. పవిత్రము. జలమున ఘృతమున్నట్లున్నది. గ్రహించవలసి ఉన్నది)

3. (చేతిలో వెన్న తీసికొని) నవనీతమా! నీవు మహా గోవుల పాలసరమవు. శరీరమునకు కాంతి కలిగించుదానవు. నాకు బ్రహ్మవర్చస్సు యొక్క కాంతిని ప్రసాదించుము.

(చేత కాటుక అందుకొని) కాటుకా! నీవు వృత్రుని రాలిన కంటినల్లని పాపవు. నీవు కళ్ళకు వెలుగునిచ్చుదానవు.

కాటుకా! నీవు నాకు కంటిని-కంటివెలుగును-కలిగింపుము.(కాటుక దిద్దుకొన వలెను)

4. మనసునకు స్వామియగు ప్రజాపతి నన్ను పవిత్రుని చేయవలెను. సవిత అచ్ఛిద్ర పావన వాయువున పవిత్రుని చేయవలెను. సూర్యుడు తన కిరణములచే పవిత్రము చేయవలెను.

పవిత్రపతే! అట్టి పావనత్వమున నీవు నాకు పవిత్రత ప్రసాదించినావు. దానితో సంకల్పించిన కర్మను పూర్తి

చేయగల సామర్థ్యము నాకు కలుగవలెను.

5. దేవతలారా! మీరు యజ్ఞమున ప్రవర్తమానులయినపుడు మిమ్ము మేము ధనము యాచింతుము మీ యజ్ఞముల సిద్ధివలన కలిగిన ఆశీర్వాదములు యాచించుచున్నాము.

6. స్వాహా. నేను మనస్ఫూర్తిగా యజ్ఞము ప్రారంభింతును. స్వాహా. నేను విస్తృత అంతరిక్షమునుండి యజ్ఞము ప్రారంభింతును. స్వాహా నేను ద్యావాపృథ్వినుండి యజ్ఞము ప్రారంభింతును. స్వాహా. నేను వాయువు నుండి యజ్ఞము ప్రారంభింతును. స్వాహా.

7. సంకల్పసిద్ధికిని- యజ్ఞసాఫల్యమునకును అగ్నయేస్వాహా' మేధస్సు మరియు మనోప్రాప్తికొరకు అగ్నయేస్వాహా. దీక్ష మరియు తపస్సు కొరకు అగ్నయేస్వాహా. సరస్వతి మరియు పోషించు దేవత పూష కొరకు అగ్నయే స్వాహా. కంటికి కనిపించు మహాజలము విశ్వము కొరకు శాంతి మయమగును. ద్యావాపృథ్వి, విశాల అంతరిక్షము విశ్వముకొరకు శాంతి మయములగును. బృహస్పతికి హవిస్సులు అర్పింతుము స్వాహా.

"బృహస్పతయే హవిషా విధేమ స్వాహా"

8. సవిత విశ్వేదేవతల నేత. అతని మిత్ర భావమును- నరుడు తన కళ్యాణమునకు- వరించవలెను. అందరు ధనమునే యాచింతురు. పోషణ కొరకు ధనమును వరించవలెను. స్వాహా

(ధనము అపరిమితముగా యాచించరాదు. పోషణకు సరిపోవునంత యాచించవలెను అవసరములకు మించిన అర్థము అనర్థమగును)

9. (కృష్ణాజినము మీది తెల్లని చారలను స్పృశించి)

ధారలారా! మీరు ఋగ్వేద, సామవేదములు స్వీకరించిన ప్రతిమూర్తులు. ఆరెండును మాకు చెందును గాత. నిన్ను పరచుచున్నాను. ప్రారంభించిన ఈ యజ్ఞపు చివరి ఋక్కు ముగియు వరకు మీరు నన్ను రక్షించండి.

చర్మమా! నీవు చర్మమవు. నా నమస్కారము అందుకొనుము. నాకు సుఖములు ప్రసాదించుము. హింసించకుము. హింసించకుము.

10. (మేఖలను చేతపట్టి) మేఖలా! నీవు అంగిరసశక్తివి. ఉన్నవంటి కోమలమైన దానవు. నీవు నాలో బలమునింపుము.

(మేఖలలో ముడి వేయుచు) ముడీ! నీవు సోమయాగసంబంధగ్రంధివి. వస్త్రమా! నీవు యజ్ఞదేవతకు గృహము వంటిదానవు.

(కృష్ణమృగపు కొమ్ముఅందుకుని) శృంగమా! నీవు ఇంద్రుని నివాసస్థానమవు. (కొమ్ము తోనేలను త్రవ్వుచు) శృంగమా! నీవు యజమాని ప్రయత్నములను ఫలవంతము చేయుము.

(చేత దండము పట్టి) నీవు నిలువుగా ఉండుము. నీవు ఉన్నతుడవు. నన్ను పాపముల నుండి రక్షింపుము. యజ్ఞమును ఉచ్చరించబడు చివరి ఋక్కువరకు నీవు ఇట్లే నిలిచిఉండుము.

11. (యజమాని అనుచున్నాడు:-)

ఋత్విజాదులాలా! మీరు నాకొరకు దుగ్ధపానము - వ్రతము -సిద్ధము చేయండి. వాగ్రూప అగ్నియే వేదము. కర్ర యజ్ఞసంబంధి (సమిధరహిత అగ్ని యజ్ఞసంబంధి కాజాలదు.) అగ్నియే యజ్ఞము.

వేదవాణి దేవసంబంధి. సుఖదాత్రి. బ్రహ్మ వర్చస్సు ప్రసాదించునది. యజ్ఞమును ముందుకు సాగించునది. అట్టి వేదవాణిని- మావశమందుండమని - యాచించుచున్నాము.

చక్షురాది దేవతలు మనసునుండి పుట్టినవారు మనసుతో సంబంధము గలవారు. యజ్ఞమును ముందుకు సాగించువారు. వారు మమ్ము ఆపదలనుండి కాపాడవలెను. వారు మమ్ము రక్షించవలెను. వారికి స్వాహా "తేభ్యః స్వాహా"

12. జలమా! త్రాగినంత మీరు త్వరగా జీర్ణమగుదురు. మా ఉదరములందు చేరి సుఖములు కలిగింతురు. యక్ష్మరహితము అన్య వ్యాధిరహితము, నిష్పాపము, ద్యోతమానము, అమృత స్వరూపము, సత్యవర్ధకమగు జలము మాకు రుచికరము కావలెను.

13.(మూత్రవిసర్జన చేయునపుడు కృష్ణమృగపు కొమ్ముతో నేలను త్రవ్వి యజమాని మట్టిపెడ్డ చేతితో తీసికొని)

లోష్టమా! ఈ నేల నీ యొక్క యజ్ఞ సంబంధి శరీరమగును. (మూత్రము విసర్జించుచు) నేను మూత్రము విసర్జించుచున్నాను - సంతానోత్పాదక వీర్యమును కాదు. విషాక్త జలమును శరీరము నుండి బయటకు పంపి, క్షీరపానమున ముఖాగ్నిని ఆహుతి ఇచ్చుచు నీవు నేలలోనికి ఎండిపొమ్ము. ఏలననగా నీవు పృథ్వినుండియే పుట్టినావు కదా!

14. (రాక్షసాది బాధానివృత్తి కొరకు అగ్నినే రక్షకుని చేసి పరుండవలెను)

అగ్నీ! నీవు అప్రమత్తుడవై ఉండుము. మేము సుఖముగా నిద్రింతుము. మమ్ము ప్రమాద రహితులను చేయుము. రక్షింపుము. మరల, మరల మమ్ము మేల్కొలుపుము.

(మనము మంత్రము చదువుట లేదు. అగ్నిని దీప రూపమున పెట్టుకొనియే పడుకొను చున్నాము)

15. (మేల్కొనిన యజమాని) మరల - మరల నాకు ఆయువు కలిగినది. మరల మనస్సు మరల ఆత్మ నాకు లభించినవి మరల కన్నులు - మరల చెవులు నాకు లభించినవి.

జఠరాగ్ని రూపమున సకలము జీవించి ఉంచు వైశ్వానరాగ్నీ! నీవు అహింసితుడవు. దేహమును పవిత్రము చేయువాడవు. పాపముల నుండి నన్ను రక్షింపుము.

16. అగ్నీ! మానవులందు మా వ్రతములను రక్షించువాడవు నీవే. యజ్ఞములందు నీవే ఏకమాత్రస్తుత్యుడవు.

(అపేక్షిత ధనమును తాకి) ధనదాత సవిత మాకు ధనము అందించినాడు. సోమదేవా! నీవు మాకు మరిన్ని ధనములను అందించుము.

17. (జుహువుతో ఘృతమును తీసి అందు దర్భ స్వర్ణ ఖండము వేసిన యజమాని)

ఘృతమా!, ఈ ఘృతము నీ శుభ్ర దేహము. ఈ సువర్ణము నీ తేజము. నీవు నీశుభ్ర శరీరముతో ఈతేజమును కూర్చుము. తేజస్సుతో కూడిన సోముని అందుకొనుము.

వాక్కూ! నీవు వేగవంతవు. మనసు నుండి వెడలిన దానవు. యజ్ఞము కొరకు నియుక్తవు.

18. శబ్దమా! నేను నీ ఆజ్ఞానువర్తిని. యజ్ఞసమాప్తి వరకు నాదేహము దృఢముగా ఉండవలెను స్వాహా.

(జుహువు నుంచి బంగరు ముక్కను పైకితీసి యజమాని)

స్వర్ణమా! నీవు తేజోరూపమవు. ఆహ్లాదకమవు. అమృతమవు. సర్వదేవసంబంధివి.

19. సోమమును కొనగల వాక్కూ! నీవే నా చిత్తమవు. మనసువు. ధారణాశక్తివి.

గోవూ! నీవు దక్షిణవు. యజ్ఞమున దక్షినారూపమున ఇచ్చిన ద్రవ్య స్వరూపమవు. నీవు క్షత్రియవర్ణసోమ సంబంధివి.

యజ్ఞసంబంధివి. అఖండమవు. మిత్రుడు నీ పాదములను బంధించును గాత. ఇంద్రుడు అధిపతి యగును గాత. పూష నిన్ను సురక్షితముగా ఉంచును గాత.

20. గోవూ! సోమమును నిన్ను ఇచ్చి కొనవలసి ఉన్నది. అందుకు ఏ చోటికి పోవుటకైనను నీమాత అనుమతించవలెను. నీతండ్రి అనుమతించవలెను. నీ సోదరుడగు ఎద్దు అనుమతించవలెను. ఏకగర్భజనితయై, ఒకే గుంపున ఉండునట్టి నీ మిత్రుడు ఆబోతు నిన్ను అనుమతించవలెను.

దేవీ! సోమక్రయిణీ! నీవు ఇంద్రార్థము సోమునిచేరుము. రుద్రుడు నిన్ను అందుకు ఆజ్ఞాపించును గాత. అట్టినీవు స్వమిత్రుడగు సోమసహితముగ తిరిగి రమ్ము.

21. (సోమము కొనుటకు ఆవును ఉత్తరదిశకు సాగనంపుచు)

గోమాతా! నీవు వసుసంబంధినివి. నీవు అదితివి. నీవు ద్వాదశ ఆదిత్యరూపమవు. నీవు రుద్రరూపవు -చంద్రరూపవు. బృహస్పతి నిన్ను సుఖముగా ఉంచును గాత. వసుసహిత రుద్రుడు నిన్ను అభిలషించవలెను.

22. ఈ భువి అఖండనీయము. ఇది దేవతలను పూజించు ఉత్తమ స్థానము. యజ్ఞమునందు ఉపకరించు ఘృతమా! నేను నిన్ను కాచుచున్నాను.

యజ్ఞస్థలమా! నీవు గోపదచిహ్నావు. ఇది నీకొరకు ఘృతసహిత ఆహుతి.

(అధర్యు స్ఫనతో యజ్ఞస్థానమును మూడుసార్లు త్రవ్వి)

గోపదమా! నీవు మాలో ఉండుము. నీ బంధుత్వము మాతోనే కావలెను. నీలో ఉన్న ధనము నాతో ఉండవలెను.

(త్రవ్విన మట్టిని పాత్రలో నింపి యజమానికి అందించి)

గోపదమా! మేము ఋత్విక్కులము. మేము ధన సమృద్ధి విహీనులము కారాదు.

(యజమాని పాత్రను తన పత్నికి అందించి పత్నీ! ధనము నీవద్దనే ఉండవలెను.)

23. (సోమమును కొను ఆవును చూచుచు యజమానపత్ని)

సోమక్రయిణీ! నేను నిన్ను పవిత్ర బుద్ధితోను- ఉదార కుశల దృష్టితోను దర్శింతును. నీవు నా ఆయువును నష్టపరచకుము. నేను సహితము ణీ ఆయువును నష్టపరచను. గోదేవీ! నీదయవలన నాకు పుత్రుడు కలుగవలెను.

**ఆలోచనామృతము**

ఇది ఆవును సాగనంపుట! ఎంత ఆర్ద్రముగ ఉన్నది! మనసును కరిగించుచున్నది!!! ఎంతటి కరుణారసభరితము! ఎంతటి వాత్సల్యము!! ఎంతటి అనుబంధము!!!

పశువును సహితము తోటిప్రాణిగా భావించుట వేదసంస్కృతి! భారతసంప్రదాయము!! మన కరుణార్ధ్రత!!!

ఈకరుణార్ధ్ర దృశ్యము కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలము నందలి శంకుతలను సాగనంపుటను తలపించుచున్నది. అచట ప్రకృతిసాంతము అశ్రుపూర్ణమగును.

యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్టముత్కంఠయా
కంఠః స్తమ్భిత బాష్పవృత్తి కలుషశ్చింతాజడం దర్శనమ్ |
వైక్లవ్యం మమ తావదీదృశమపి స్నేహాదరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథంను తనయా విశ్లేషదుఃఖైర్నవైః ||

ఇవ్వాళ శకుంతల వెళ్లిపోతున్నది. ఈమాటయే నాగుండెలో బాధగూడు కట్టినది. గొంతు పూడుకున్నది. కన్నీరునిండి చూపుమందగించినది. నేను అడవిలోని వానిని. మునిని. ఈ స్నేహము అబ్బో! నన్నే ఇంత బాధించుచున్నదే! పాపంబిడ్డను కన్నవారు కూతురును కొత్తగా అప్పగింతలు పెట్టునపుడు ఎంత బాధపడుదురో కదా!

అంటాడు కణ్వుడు శకుంతలను సాగనంపుతూ.

ఇంతటి మానవత, ప్రేమ, అభిమానము, వాత్పల్యము, కరుణ భారతజాతికి ఎన్ని యుగుముల పున్నెపుపంట!

వేదములు, ఉపనిషత్తులు, రామాయణాది మహాకావ్యములు, ఋషులు, మునులు, తాత్వికులు వారి తత్త్వబోధలు భారతీయులలో ఇంతటి అనుబంధమును, అనురాగము నింపి భారత జనజీవనమును అమృతతుల్యము చేసినది.

ఇంతటి మహాతపస్సును మరల పొగగొట్టపు పొగ బూడిదచేసినది. అది మనిషి మనసును పొగతో నింపినది. ఆత్మీయతలు, అనుబంధములు, అనురాగములు అన్నింటిని ఆవిరిచేసినది!

"అదిత్యాః అఖండనీయా పృథివ్యాః" అని మహీధరుడు. ఈపృథ్వి సొంతము ఒక్కటియే. అది ఖండించరానిది. ముక్కలు చేయరానిది అని అర్థము.

భగవంతుడు ఈ సమస్త భూమండలమును ఏకఖండముగా-అఖండనీయముగా సృష్టించినాడు. రాజులు, రాజకీయులు వారి అధికార దాహమునకు ఈనేలను ముక్కలు చెక్కలుగా చేసి పాలించుచున్నారు. గత అర్థశతాబ్దమును అప్పటి భారతదేశము -రాజకీయుల అధికారదాహమునకు బలియై - భారత, పాకిస్తాన్, బంగ్లాదేశ్ మూడు ముక్కలైనది.

"మృత్పిణ్డోజలరేఖయా వలయితస్సర్వోప్యయం నన్వణుః
స్వాంశీకృత్య సపన సంయుగశతై రాజ్ఞాంగణైర్భుజ్యతే" అన్నాడు భర్తృహరి.

ఈభూమి ఎంత? సముద్రము చుట్టిన మట్టి ముద్ద! ఇది ఈసృష్టిలో ఎంత? అణువంత! ఈ అణువంత కోసం రాజుల యుద్ధాలు! పంచుకోవటాలు! పాలించుటలు!!!

24. యజమాని అనవలసినది:-

అధ్వర్యులారా! సోమము వద్దకు వెళ్లండి. ఇది నీ గాయత్రీ ఛందోభాగము, అని నాసందేశముగా చెప్పండి. అధ్వర్యులారా! ఇది నీ త్రిష్టుప్ ఛందోభాగము, అని నాసందేశముగా చెప్పండి. అధ్వర్యులారా! ఇది నీ జగతీ ఛందోభాగమని నా సందేశముగా చెప్పండి. అధ్వర్యులారా! 'సోమమా! నీవు అశేష ఛందో సామ్రాజ్యమును అలంకరించుము' అని నాసందేశముగా చెప్పండి.

సోమమా! నీవు మావాడవు. ఇంద్రుడు మున్నగు దేవతల పానపాత్రములందు నిండిన నీవు సర్వసమర్థుడవు. ఋత్విక్కులు బుద్ధిమంతులు. వారు మిమ్ము వేరువేరుగా ఉంచగలరు.

25. సవిత ద్యావాపృథ్వులందున్నవాడు కొంత ప్రజ్ఞుడు. సత్యమూర్తి. రత్నదాత. ప్రియతముడు. కవి. బుద్ధికుశలుడు. అట్టి ద్యోత మానుడగు సవితను నేను పూజింతును. సూర్యుని కాంతి బ్రాహ్మణక్షత్రియాదులను వారి పనులకు నియోగించును. సవిత అట్టివాడు. స్పృహణీయుడు. సుప్రజ్ఞుడు, అతడు తన సంకల్పమున స్వర్గమును నిర్మించినాడు.

(సోమపు ముక్కలను తలగుడ్డలో చుట్టుకొని)

సోమమా! నాకు సంతానము కలుగుటకు నిన్ను కట్టుచున్నాను. నా సంతానము నీకు ప్రాణప్రదానము

చేయగలదు. నీవు మా సంతానమునకు ప్రాణప్రదానము చేయుము.

26. సోమమా! నీవు దీప్యమానవు. నిన్ను దీప్యమాన స్వర్ణమున ఖరీదు చేయుదును. ఆహ్లాదకరమును, ఆహ్లాదకరముతోను, అమృతస్వరూపమును అమృతస్వరూపమునను ఖరీదు చేయుదును.

సోమము విక్రయించుదానా! మా గోవులు, బంగారము నీకు చెందవలెను. ఆహ్లాదకర సోమము మాకు చెందవలెను.

(మేకను సోమపు మూల్యముగా ముందుకుజరిపి) నీవు తపోదేహమవు> ప్రజాపతి వర్ణమవు> సోమమా! నీరాక వలన మాపుత్ర, పశ్వాదులు వేయింతలు పెరుగవలెను.

27. మంచిమిత్రులను కూర్చగల సోమమా! నీవు మమ్ము మిత్రుని ద్వారా చేరుకొనుము. నీవు కోరదగిన సుఖకరుడవు. యుజమాని యొక్క సుఖకరమగు కుడితొడమీద కూర్చుండుము. స్వాన. భ్రాజ, అంధారే- వింభారే - హస్త, సుహస్త, కుషానులారా! మీరందరు 'సోమమును' రక్షించువారు. ఇవి సోమము ఖరీదుచేయు గోవులు, మేకలు, స్వర్ణాదులు. మీరు వానిని రక్షించండి.

సోమరక్షకులారా! సోమమును-గోవులు మేకలను రక్షించునపుడు మిమ్ము రాక్షసాదులు పీడించకుండనై నేను నా ఆయుర్దాయము నుండి అమృతత్వమును అందుకొందును.

29. మేము శుభంకరము- పాపరహితమగు మార్గమున ప్రవర్తిల్లుచున్నాము. ఈ మార్గమున మానవుడు దుష్టత్వమును విడుచును. దానితో పాటు తప్పక ధనమును అందుకొనును.

30. కృష్ణమృగచర్మమా! నీవు నేలతోలువంటిదానవు. నేలమీద చాచుకొనుము.

(పరచిన మృగాజినమున సోమమును ఉంచవలెను. అట్లుంచిన సోమము వరుణ స్వరూపమగును)

వరుణుడు వరప్రదుడు. ద్యులోకమున స్తంభింపచేసిననాడు. పృథ్వివ్యంతరిక్షములను విస్తారము చేసినవాడు. శ్రేష్ఠత్వమును కొలిచినవాడు. వరుణ సామ్రాట్టు సమస్త భువనములందు వ్యాపించును స్థిరపడును.

ఇవన్నియు వరుణుని ప్రశంసనీయ కార్యములు.

31. వరుణుడు వృక్షాగ్రములందు అంతరిక్షమును విస్తరించినాడు. అతడు అశ్వములందు వేగమును గోవులందు క్షీరములను-యజమానుల హృదయములందు యజ్ఞమును- ప్రజలందు అగ్నిని - ద్యులోకమునందు సూర్యుని -

పర్వతములందు సోమమును స్థాపించినాడు. అట్టి వరుణుని మేము స్తుతింతుము.

32. కృష్ణాజినమా! నీవు సూర్యుని చక్షువు- అగ్ని యొక్క కంటిపాప అంతటి ఎత్తుకుచేరుము. అచట నీకు రాక్షసాది బాధలుండవు. అచటినుండి అధ్వర్యులు నిన్ను అశ్వముల మీద తీసికోని వెళ్లుదురు.

33. ఎద్దులారా! మీరు అశ్రురహితముగ సంతోషముగ బండిలాగుదురు. మీరు కొమ్ములతో మా శిశువులను క్రుమ్మరు. బ్రహ్మణులను యజ్ఞమునకు ప్రోత్సహింతురు. మీరు శకటమునకు సంయోజితులు కండి. మీకు శుభములు కలుగును గాత. మీరు యజమాని గృహమునకు చేరండి.

34. సోమమా! నీవు నాకొరకు బృహత్ శుభంకరుడవు. నీవు ఋత్విజాదుల స్వామివి. నీవు వెళ్ళు మార్గములన్నింటికి నన్ను చేర్చుము. మార్గమును నిన్ను దొంగలు దొంగిలించరాదు. రాక్షసాదులు హింసించరాదు. బందిపోట్లు, పాపిష్టితోడేళ్లు నిన్ను పట్టరాదు. యజమాని గృహమే అధ్వర్యుడనగు నాకు- నీకు అనుకూలస్థానము.

36. కొలలారా! మీరు సోమమును వహించు బండిన నియంత్రించువారలు. సోమమును వహించు బండికి కట్టిన ఎద్దులను విడిపోకుండ నిలుపువారలు. పీఠమా! నీవు యజ్ఞమున కూర్చుండ స్థానమవు. (పీట మీద మృగ చర్మమును పరచి) మృగచర్మమా! నీవు సోమమును ఉంచుటకు తగిన స్థానమవు. నీవు పీఠము మీద ఆసీనుడవగుము.

37. సోమమా! ఋత్విజులు ఏ ఏ స్థానములందు నిన్ను హవి అర్చించి- పూజింతురో అట్టి అన్ని స్థలములకు యజ్ఞము విస్తరిల్లవలెను. నీవు యజమాని గృహమును వర్ధిల్లచేయుదువు. తరింపచేయుదువు. సుపుత్రులను ప్రసాదింతువు. పుత్రపౌత్రులను హింసించవు.

సోమమా! నీవు యజమాని గృహములందు స్వేచ్ఛగా సంచరించుము.

దాశరథి రంగాచార్య విరచిత

శ్రీమదాంధ్ర వచన శుక్ల యజుర్వేద సంహితయందలి

శాలాప్రవేశాస్త్ర మంత్రముల నాలుగవఅధ్యాయము సమాప్తము.

సర్వేపి సుఖినస్సంతు.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతం |

ఆధారస్సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ||

1.  అగ్నేస్తనూరసి విష్ణవేత్వాసోమస్య తనూరసి విష్ణవే
త్వాతిథేరాతిథ్యమసి విష్ణవేత్వాశ్యేనాయ త్వాసోమభృతే
విష్ణవే త్వాగ్నయే త్వారాయస్పోషదే విష్ణవేత్వా ||

గాయత్రీ ఛందమా! సోమ సామ్రాట్టు భృత్యుడగు అగ్నికి నీవు శరీరమవు. హవీ! నేను బహుయజ్ఞ వ్యాపక సోమము కొరకు భూమి మీద స్థాపించుచున్నాను.

త్రిష్టుప్ ఛందమా! నీవు సోమసామ్రాట్టు సేవకుడగు అగ్నికి నీవు శరీరమవు. హవీ! నేను బహుయజ్ఞ వ్యాపక-సోమము కొరకు భూమి మీద స్థాపించుచున్నాను.

త్రిష్టుప్ ఛందమా! నీవు సోమ సామ్రాట్టు భృత్యుడగు అతిథికి అతిథి సత్కారమవు. హవీ! నేను - బహుయజ్ఞ వ్యాపక సోమము కొరకు నిన్ను భూమి మీద స్థాపించుచున్నాను.
స్వర్గము నుండి సోమము కొరకు నిన్ను భూమి మీద స్థాపించుచున్నాను.

స్వర్గము నుండి సోమము తెచ్చు శ్యేన రూపమగు గాయత్రీ ఛందము మరియు బహుయజ్ఞ వ్యాపక సోమము కొరకు హవీ! నిన్ను భూమి మీద స్థాపించుచున్నాను.

సోమసామ్రాట్టు అన్యభృత్యులు- ధనసమృద్ధి నొసంగు అగ్ని - బహుయజ్ఞ వ్యాపక సోమము కొరకు హవీ! నిన్ను భూమి మీద స్థాపించుచున్నాను.

విష్ణవే బహుయజ్ఞవ్యాపినే అనిమహీధరుడు.

2. ప్రస్తరఖండమా! నీవు అగ్నిని పుట్టించువాడవు. (రెండు దర్భలను అందుకొని) దర్భలారా! మీరు అత్యంత సమర్థులు.

అగ్నిని మథించు దిగువ అరణీ! నీవు ఊర్వశివి. అగ్నిని మథించు మీది అరణీ! నీవు పురూరవుడవు.

అగ్నీ! నేను నిన్ను గాయత్రీ ఛందస్సుచే మథించి ప్రకటింతును. అగ్నీ! నేను నిన్ను త్రిష్టుప్ ఛందస్సుచే మథించి ప్రకటింతును. అగ్నీ! నేను నిన్ను జగతీ ఛందస్సుచే మథించి ప్రకటింతును.

(అగ్నిని మూడు సార్లు మథించవలెను)

3. మథించి పుట్టించిన మరియు ఆహవనీయ అగ్నులారా! మీరా మా కొరకు సమానమనస్కులు సమాన చిత్తులు -

నిష్పాపములు కండి. మీరు ఈ యజ్ఞమునకు విఘాతకులు కారాదు. యజ్ఞపతిని బాధించరాదు. ఇకముందు మీ ఉభయ అగ్నులు మాకు శుభంకరులు కావలెను.

4. ఋత్విజులకు పుత్రరూప - వారు మధించి పుట్టించినందున - అగ్నీ! నిందలనుండి రక్షింటు మధిత - ఆహవనీయ అగ్నులందు ప్రవేశింపుము. యజన కార్యమును నిర్వాహించుము.

సుఖకర, అత్యంత యజనీయ అగ్నీ! నీవు ఆలస్యము కానీయక సదాదేవతలకు హవి హోమము చేయుము. అగ్నయే స్వాహా.

5. (పాత్రలో నింపిన ఆజ్యమున జుహువున తీసి)

జుహువునందున్న అజ్యమా! నిరంతరగతి కలిగి -సర్వ వ్యాప్త ప్రజాపతికి పౌత్రుడును సర్వ ఆధార భూత ఆకాశమునకు పుత్రుడును - సర్వకర్మ సమర్థుడు, అత్యంత శక్తిశాలి అయిన వాయువు కొరకు నిన్ను అందుకున్నాను.

(పరస్పరము ద్రోహము చేయకుండుటకు ఋత్విక్కు ఘృతమును తాకి) మేము శపథము చేయు ఋత్విజులము. పూర్వకాలమున నీవు మాచే ఎట్టినిందలు లేనివాడవుగా చేయబడినావు. నేడు సహితము నీవు నిందలు లేనివాడవు అయినావు.

ఘృతము నిందారహితము. నిందలనుండి రక్షించునది. అనిందనీయము. త్రికాల సత్యము. అట్టి ఘృతము మాకు సులభముగా లభించవలెను. ఘృతమా! నీవు నన్ను సుప్రాప్తన్య స్వర్గ లోకమునకు చేర్చుము.

6. అగ్నీ! నీవు వ్రతపాలకుడవు. నేను నిన్నే ఆశ్రయించుచున్నాను.

వ్రతపాలక అగ్నీ! ణీ జ్వాలారూపదేహము నాలో లీనము కావలెను. నా దేహము 'నీలో లీనము కావలెను.

వ్రతపతి అగ్నీ! మనఉభయుల వ్రతములు ఒకేసారి సమాప్తము కావలెను.

దీక్షాపతి సోమమా! నా దీక్షను ఆమోదించుము. తపముల స్వామి సోమము నా ఉపసద్రూప తపమును ఆమోదించవలెను.

7. సోమమా! ఇంద్రుడు ఏకమాత్ర సోమరసధనమును అందుకొనువాడు. అతని కొరకు నీ ప్రత్యంశము అభివృద్ధి చెందవలెను. నిన్ను పానము చేయుటకు ఇంద్రుని శరీరము అభివృద్ధి చెందవలెను. ఇంద్రుని కొరకు రసపూర్ణవమగుము.

సోమమా! నీవు ధనలాభము కలిగించువాడవు. మేము మేధోజీవులము - మిత్రులము- ఋత్విజులము. మాకు అభ్యుదయము కలిగించుము. నాకు శుభములు కలుగవలెను. మేము అభిషవక్రియ పూర్తి చేయకలుగవలెను. మేము సత్యవాదులము. మాకు కోరిన ధనము, సౌభాగ్యము, సత్యము లభించవలెను.

నమోద్యావాపృథివీభ్యాం, ద్యావాపృథ్వులకు నమస్కారము.

8. అగ్నీ! ఈపృథ్వివి మీద అసురుల లోహపురములున్నవి. నీశరీరము అందు ఉన్నది. అది కోరకలు తీర్చునది. నిగూఢము. ఆ శరీరమే దేవతల ఆకలిదప్పుల వలన కలిగిన దారుణ వచనములను శమింపచేసినది. మేము పాపము చేసినామా" మున్నగు అమర్షవచనములను ఉపశమింప చేసినది. ప్రియమగు నీదగు ఆమూర్తికి స్వాహా.(ప్రథమ దిన ఉపసద హోమము చేయవలెను)

అగ్నీ! అంతరిక్షమున అసురుల రజత పురములున్నవి. అచట నీ జ్వాలామయ దేహము ఉన్నది. అది దేవతల ఆకలి దప్పుల వలన కలిగిన దారుణ వచనములను ఉపశమింపచేసినది. పాపములు చేసినామన్న దేవతల అమర్ష వచనములను ఉపశమింప చేసినది. అట్టి నీ దేహమునాకు స్వాహా. (ద్వితీయ దిన ఉపసద హోమము చేయవలెను)

అగ్నీ! ద్యులోకమున అసురుల సువర్ణ పురములున్నవి. అచట నీవు ఉన్నావు. నీవు దేవతల ఉగ్ర, ప్రదీప్త వచనములను ఉపశమింపచేసినావు. అట్టి నీకు స్వాహా.

9. పృథివీ! నీవు నన్ను తపింప చేయుదానవు - జీవిక కొరకు అటునిటు ఉరికించుదానవు. నీవు నాకు విత్తము నిచ్చు దానవు. విత్తము కొరకు ఉరికించుదానవు. నీవు నన్ను యాచనల నుండి రక్షింపుము. దుఃఖముల నుండి రక్షింపుము.

(వేది నిర్మించుటకు మట్టి తీయుటకు గాను తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణములకు నేలమీద గీతలు గీయవలెను. స్ఫనతో మట్టిని త్రవ్వి ఎత్తి ఉంచవలెను.)

మృత్తికా! నిన్ను నభనామముగల అగ్నియే ఎరుగును. అంగిరస అగ్నీ! "ఆయువు" అను పేరా నిన్ను ఉత్తర వేది మీద స్థాపించుచున్నాను. నీవు భూమి మీద ఉన్నవాడవు.

అగ్నీ! నీది అఘర్షిత యజనీయ నామము. ఆపేరనే నిన్ను ఉత్తర వేడిన స్థాపించుచున్నాను. (మొదటిసారి మట్టిని తెచ్చిపోయవలెను)

నభనామ అగ్నీ! ఈ తెచ్చిన మట్టిని తెలిసికొనుము. నీవు నీ గతిమయ నామమున ఇచట- ఉత్తర వేదిన స్థిరపడుము. నీవు ద్వితీయ పృథ్వియగు అంతరిక్షమున ఉన్నవాడవు. నీది అఘర్షిత- యజనీయ నామము. ఆనామముతోనే ఉత్తర

వేదిన నిలుపుచున్నాను. (రెండవసారి మట్టి తెచ్చి పోయవలెను)

నభనామ అగ్నీ! ఈ తెచ్చిన మట్టిని తెలిసికొనుము. గతిశీల అగ్నీ! నీవు గతిశీలుడవు అంగిర నామము గల వాడవు. ఆ నామముతోనే నిన్ను ఉత్తర వేదిన నిలుపుచున్నాను. నీవు తృతీయ పృథ్వియగు ద్యులోకమున ఉన్నవాడవు. నీది అఘర్షిత - యజనీయ నామము. ఆ నామముననే నిన్ను ఉత్తర వేదిన నిలుపుచున్నాను. (మూడవ, నాలుగువ సారి మట్టిని తెచ్చి పోయవలెను)

మృత్తికా! నిన్ను దేవతల ప్రీతి కొరకు తెచ్చినాను.

10. (ఉత్తర వేదిని నిర్మించుచు) హే వాక్! నీవు శత్రువులను దునుమాడు సింహినివి. దేవతల కొరకు నీవు వేది రూపము దాల్చుము, (వేదిని శుద్ధి చేసి) హే వాక్! నీవు శత్రువులను దునుమాడు సింహినివి. వేదీ! నీవు శుద్ధివగుము. నీవు శత్రువును దునుమాడు సింహినివి.. వేదీ! నీవు దేవతల కొరకు అలంకృతవగుము. (నీళ్లు చల్లి నేలను చదును చేయవలెను)

11. ఉత్తరవేదీ! వసువుల సహితుడైన ఇంద్ర ఘోష నామ దేవత నీకు తూర్పు దిక్కు నుండి వచ్చు ఆపదలను నివారంచవలెను. ఏకాదశరుద్ర సహితుడై విశేష జ్ఞానము గల వరుణుడు నీకు పడమటి దిక్కు నుండి వచ్చు ఆపదలను నివారించవలెను. పితరుల సహితుడైన యముడు నీకు దక్షిణ దిశ నుండి వచ్చు ఆపదలను నివారించవలెను. (నీళ్లుపోసి వేదిని అలకవలెను) ఇప్పుడు ఈ నీరు మురికియైనది. పారబోయదగినది అయినది. దీనిని యజ్ఞవేది నుండి పరిహరింతును. (నీరు పారబోయవలెను)

12. వేదికా! నీవు సింహినివి. ఇది నీ హవి. నీవు ఆదిత్యుని ప్రసన్నుని చేయు సింహినివి స్వాహా. నీవు బ్రాహ్మణ, క్షత్రియులను ప్రసన్నులను చేయు సింహినివి స్వాహా, నీవు మంచి సంతానము, అన్నమును ప్రసాదించు సింహినివి స్వాహా.

వేదికా! నీవు సింహినివి. యజమానికి శుభములు కలిగించుటకు దేవతలను తీసికొని రమ్ము స్వాహా.

హోమ మందున ఆహుతులు ఇచ్చుటకు ఘృతము నిండు జుహువా! సర్వభూత కళ్యాణము కొరకు నిన్ను ఎత్తి ఆహుతులు అర్పింతును.

13. మధ్య పరిధీ! నీవు అత్యంత స్థిరమవు. పృథివిని దృఢపరచుము. దక్షిణ పరిధీ! నీవు అటల యజ్ఞమున స్థిరమవు. అంతరిక్షమును దృఢపరచుము. ఉత్తర పరిధీ! నీవు అగ్ని యజ్ఞమున స్థిరమవు. ద్యులోకమును స్థిరపరచుము.

(గుగ్గులాది యజ్ఞ సంభారము -గొర్రె వెంట్రుకల గుచ్ఛమును వేదిక మధ్యమున వేయవలెను.)

14. యజమాని విద్వాంసుడు, మహామహుడు. అతని ఋత్విజులు విద్వాంసులు. మహామహులు. వారు యజ్ఞ కర్మమున తమ మనసులను లగ్నము చేయుదురు. వీరు తమ బుద్ధులను కూడ యజ్ఞమున లగ్నము చేయుదురు.

'బ్రహ్మ' అను ఒక ఋత్విజుడు ప్రజ్ఞావంతుడు. అతడు ఆరుగురు వషట్కర్తలను యజ్ఞకర్మమున నియోగించును.

ఇది సవితృ దేవుని మహిమాన్వితస్తుతి. సవితాయై స్వాహా.

15. విష్ణువు దీనినంతటిని అతిక్రమించినాడు. అతడు మూడుమారులు తన పాదమును ఉంచినాడు. అతని పాదన్యాసముందే సమస్త లోకములు నిలిచిఉన్నవి. అట్టి విష్ణువునకు స్వాహా

(దక్షిణ హవిర్ధాన శకట మార్గమున బంగారము ఉంచి అధ్వర్యు అచటనే ఆహుతి ఇవ్వవలెను)

16. ద్యావాపృథ్వులారా! మీరు జలవతులు - గోవతులు. యజమానికి యజ్ఞమునకు వలసిన సామగ్రి ప్రసాదించువారు.

విష్ణో! నీవు స్వకిరణములచే ద్యావాపృథ్వులను స్తంభింపచేసినావు. పృథ్విని భరించినావు. అట్టి కిరానాములకు స్వాహా.

(ఉత్తర హవిర్ధాన శకట మార్గమున బంగారము ఉంచి ప్రతిప్రాస్థాత అచటనే ఆహుతులు అర్పించవలెను)

17.(ప్రస్థాత హుత శేష ఘృతమును యజమాన పత్నికి ఇచ్చును. ఆమె ఆ ఘృతమును హవిర్ధాన శకటపు రెండు ప్రక్కలకు పూయును.)

అక్ష, ధురములారా! మీరు దేవతలందు విఖ్యాతలు. మీరు యజ్ఞమును గురించి - దేవతలకు ప్రకటించండి. యజ్ఞమును నిర్వహింపచేయండి. ప్రకర్షమున ముందుకు సాగండి. మీరు యజ్ఞమును పైపైకి దేవతల వద్దకు చేర్చండి. మీరు యజ్ఞమున కుటిలముగా ప్రవర్తించరాదు.

గృహస్వరూప శకటాభిమానినీ దేవతలారా! యజమాని గృహమున గోవులు సంపన్నలై ఉండవలెనని పలుకండి. మీరు యజమాని ఆయువును - అతని సంతానమును నష్టపరచకండి. మీరు ఇచట పృథ్వి యొక్క శ్రేష్ఠ స్థానమగు. యజ్ఞమున ఆనందించండి.

18. నేను విష్ణువు వీర కార్యములను వర్ణించుచున్నాను. విష్ణువు దీర్ఘపాదముల వాడు. అతడు మూడు అడుగులు

వేసినాడు. భూమి, లోకముల కొలతలు వేసినాడు. ఉత్తమ స్థానమగు దేవలోకమును స్తంభింపచేసినాడు. అట్టి విష్ణువునకు స్వాహా. (దక్షిణ శకటపు ముందున్న బండిని ఎత్తి ఉంచు కర్రలను భూమి మీద నిలుపవలెను.)

19. విష్ణో! ద్యులోకము, భూలోకము, మహర్లోకము. విస్తృత అంతరిక్షముల నుండి నీ రెండు చేతులందు ధనము నింపుకొనుము. అట్లు తెచ్చిన దానిని నీ కుడి - ఎడమ చేతులతో మాకు అందించుము. విష్ణవే స్వాహా.

(ఉత్తరమున నిలిచి ఉన్న హవిర్ధాన శకటపు ఎత్తి ఉంచుకర్రలను ఆనించి బండిని నిలుపవలెను.)

20. విష్ణువు అత్యంత బలవీర్యములు గలవాడు. అతడు సర్వత్ర సంపూజ్యుడు. అతడు గుహలో ఉన్న సింహము వలెను, బయటనున్న సింహము వలెను భయంకరుడు. అతని మూడు విక్రమములందే లోక -లోకాంతరములు - నిలిచి ఉన్నవి.

(మధ్య ఛాద్యమును ముట్టుకొనవలెను)

21. (రెండు హవిర్ధాన శకటముల గూళ్ళను ముట్టుకొని) మీరు విష్ణువు లలాటము వంటివారు. (రెండు ఇరుసులను తాకి) మీరు విష్ణువు పెదవుల వంటివారు. (పగ్గమును తాకి) నీవు విష్ణువు సంధాత్రివి. (ముడివేయుచు) నీవు విష్ణువు స్థిరత్వమవు.

హవిర్ధాన మంటపమా! నీవు విష్ణు దేవతాకమవు. నేను నిన్ను విష్ణు దేవుని నిమిత్తము తాకుచున్నాను.

22. అభ్రీ! నేను సవితా దేవుని ఆజ్ఞానువర్తిని. నేను నిన్ను అశ్వినుల బహువులతో పూష హస్తములతోనూ పట్టుకొను చున్నాను. నీపేరు అభ్రి - నేలను త్రవ్వు కర్రసాధనము. నిన్ను చేతపట్టి నాలుగు గుంతలు త్రవ్వి రాక్షసుల గొంతులు కోయుదును.

(తూర్పున ప్రారంభించి దక్షిణ శకటము క్రింద నాలుగు దిశలందు నాలుగు 'ఉపరవము'లను గుంతలు త్రవ్వవలెను)

ఉపరవ నామగర్తలారా! మీరు మహానులు. మహా ధ్వని చేయువారు. బృహద్రవకర్త ఇంద్రుని నిమిత్తము మహా ధ్వనిని ఉచ్చరించండి.

23. స్తోతలారా! రాక్షసులను వధించునదియు - కృత్య రూప అస్థికేశాదులను ధ్వంసము చేయునదియు - విష్ణు సంబంధి స్తుతిని ఉచ్చరించండి. నా శత్రువులు కృత్యమ పాతిపెట్టినారు. నేను దానిని పెరికి పారవేయుదును.

దిక్కున్న చల్లవలెను)

(జీవితము మిత్రుల మీద ఆధారపడినది అనుచున్నాడు. ఈ విషయము భర్తృహరి:-

మొదల జూచిన గడుగొప్ప పిదపగురుచ
యాది కొంచెము తర్వాత నధికమగుచు
దనరు దినపూర్వపరభాగ జనితమైన
ఛాయపోలిక గుజనసజ్జనులమైత్రి

20. వడిగల నడకలవానికి పాదుకలు వదులుట వలనను - చెమటవంటి వానికి స్నానము వలన శుభ్రత కలిగినట్లును - ఘృతము జల్లించుట వలన శుద్ధమైనట్లును - జలము నన్ను పాపములనుండి విముక్తుని చేయవలెను.

21. (ఈమంత్రము చదువుచు జలమునుంచి బయటకు రావలెను)

ఉత్తమ సూర్యప్రకాశమును దర్శించి మేము అంధకారమును అధిమించినాము. దేవలోకమందున్న సర్వోత్తమ జ్యోతియగు సూర్యుని పొందినాము.

22. (ఆహవనీయ ముపతిష్ఠ - యజమాని ఆహవనీయ అగ్నిని ఉపస్థానము చేయును)

అగ్నీ! నేను జలస్నానము చేసినారు. నేను నీట తడిసినాను. తడిసియే నీవద్దకు చేరినాను. నిన్ను చేరిన నాకు బ్రహ్మవర్చస్సు, సంతానము, ధనము కలిగించుము.

23. (సమిధమాదత్తే - యజమాని అగ్నిలోసమిధ వేయును)

సమిధా! నీవు ఇంధనమవు. నీప్రభావమున మేము వర్ధిల్లుదుము గాత.

నీవు సమిధవు. నీవు నీతేజస్సువు. నీతేస్సును నాలో ప్రవేశపెట్టుము.

(యజమాని ఘృతాహుతులు ఇచ్చును)

పృథివి సమ్యగా వర్తితమగును. ఉష, సూర్యుడు, విశ్వము, జగత్తులు సమ్యగా వర్తితములగును. నేను వైశ్వానర జ్యోతినగుదును గాత. నేను సమస్త అభిలాషలను అందుకొందును గాత. 'భూ! స్వాహా'

(ఇదే అహం బ్రహ్మాస్మి అగును)

24. (యజమాన ఆహవనీయే తిస్రః సమిధ్కోఽభ్యాదధాతి. యజమాని ఆహవనీయమున మూడు సమిధలు సమర్పించును)

యజ్ఞపాలక అగ్నీ! నేను నీయందు సమిధలు సమర్పించుచున్నాను. నీ దయవలన నాకు యజ్ఞమునందు శ్రద్ధకలుగును గాత. నేను నిన్ను ప్రజ్వలితుని చేయుచున్నాను. సమిధాధానమున నేను దీక్షవహించిన వాడనయినాను - "దీక్షితో అహమ్"

25. ఏ బ్రహ్మలోకమున బ్రహ్మణక్షత్రియులు కలసి సాగుదురో. ఎచట అగ్ని సహితులై సమస్త దేవతలు విరాజమానులగుదురో, అపుణ్యలోకములు నాకు తెలియును గాత. "లోకం పుణ్యం ప్రజ్ఞేషం".

26. ఎచట ఇంద్రవాయులు కలసి సంచరింతురో, ఎచట ఆకలి దప్పులుండవో అట్టి "లోకం పుణ్యం ప్రజ్ఞేషం".

27. సురా! సోమాంశమున నీ అంశము సంయుక్తమగును గాత. పర్వము పురుషునితో సంయుక్త మగును గాత. నీ సుగంధము మత్తునకుగాను సోమమును ఆలింగనము చేయును గాత. అవినాశ్యమగు నీయొక్క రసము సోమముతో సంయుక్తమగును గాత.

28. సోమరసమును సురచే సించితము, పరిసించితము, ఉత్సించితము చేయుదురు - పవిత్రము చేయుదురు. ఇంద్రుడు - బభ్రువర్ణసుర యొక్క - మత్తులో శత్రువును 'నీవెంత నీబలమెంత' అని దూషించును.

29. ఇంద్రా! ఇచట వేసిన యవలు - కరంభము- అప్పులు, శస్త్రయుక్త సోమరసము ఉన్నది. వీనిని నీవు ప్రాతః కాలమున సేవించుము.

30. ఋత్విజులారా! దేవతలు సామమున యజ్ఞమును వర్ధిల్లచేసినారు. సామముననే దేవతలు ఇంద్రుని కొరకని జాగరణశీల జ్యోతిని కల్పించినారు. మరల మరల వృత్రుని హతమార్చు ఇంద్రునికొరకు బృహత్సామ గానము చేయండి.

31. అధ్వర్యులారా! సోమమును రాళ్లతో దంచండి. అభిషవించండి. దశాపవిత్రముణ జల్లించండి. దానిని ఇంద్రుని పానము కొరకు అర్పించండి.

32. ఎవడు సమస్త భూతములకు అధిపతియో, ఎవనిని సమస్త భూతములు ఆశ్రయించి ఉన్నవో, ఎవడు మహిమాన్వితులలో మహిమాన్వితుడో, ఎవడు సర్వసమర్ధుడో, అట్టి వాని అనుమతి తోనే ఈగ్రహమును, పాత్రను, గ్రహించుచున్నాను. పరమాత్మ స్వరూపమున నేను నిన్ను అందుకొనుచున్నాను.

33. నీవు ఉపయామము ద్వారా గ్రహించబడినావు. నిన్ను అశ్వినులు - సరస్వతి - సుత్రాత ఇంద్రుని కొరకు అందుకొనుచున్నాను. గ్రహమా! ఇది నీస్థానమగును. నేను నిన్ను అశ్వినులు సరస్వతి - సుత్రాతి ఇంద్రుని కొరకు ఇచట స్థాపించుచున్నాను.

34. (ఋత్విజః ప్రాణభక్షం భక్షయంతి)

గ్రహమా! నీవు నాప్రాణపాలకుడవు. నా అపానపాలకుడవు. నేత్ర పాలకుడవు. నా కర్ణపాలకుడవు. నీవు నావాణికి భేషజమవు. నా వాక్కును అనృతము నుండి మార్చి సత్కర్మలు చేయించుదానవు. నీవు నామనసునకు సత్ప్రేరకమవు.

35. అశ్వినులు, సరస్వతి, సూత్రాత ఇంద్రునిచే దర్శించబడి ఋత్విజులచే ఉహూతమగు నిన్ను నేను భక్షించుచున్నాను.

36. ఇంద్రుడు అపూర్వ కర్మలు చేయువాడు. సోమపానమున వర్ధిల్లువాడు. ఉషఎగిసి ఉడిగినపుడు, తూర్పున మహాజ్యోతి దర్శనము ఇచ్చినపుడు ఇంద్రుడు మేల్కొన్నాడు. ముప్పది ముగ్గురు దేవతల సహితుడై వజ్రబహువగు ఇంద్రుడు వృత్రుని వధించినాడు. నదుల ద్వారములు తెరచినాడు.

37. యజమాని ఋత్విజులచే ప్రశంసింపబడువాడు. శూరుడు. పుత్రాదులచే వంశము నిలపెట్టువాడు. పశువపాయుక్తుడు ఆవుపాలు, తేనె హవిస్సులందు కలుపువాడు. స్వర్ణఖండములు దక్షిణగా ఇచ్చి ఆనందింప చేయువాడు. విశాలహృదయుడు. అతడు ఇంద్రుని యజించును.

38. ఇంద్రుడు ఋత్విజులచే స్తుతించబడువాడు. సుఖప్రదుడు. అతడు వసువులతోను ఆదిత్యులతోను విచ్చేసినాడు. దర్భాసమున ఆసీనుడు అయినాడు. వేదిపూర్వభాగమున స్థిరపడినాడు.

40. యజ్ఞద్వారములారా! ధ్వనిచేయండి. ఉరకండి. ముత్తైదువుల వలె ముందుకు సాగండి. ఇంద్రునకు స్వాగతము పలకండి. మీరు వీర రుతుయుక్తలు. ఉత్సవములందు విస్తృతినొందువారు. వీరుడగు ఇంద్రుని కొరకు పూర్తిగా తెరుచుకొనండి.

41. ఉషారాత్రులు మహత్తులు. తుహినయుతలు. ఫలప్రదాతలు. సుందర కిరణవంతలు. విశాల కాలతంతువును నలుపు, తెలుపురంగులతో నేయువారు. వారు శూరుడు దేవదేవుడగు ఇంద్రుని యజింతురు.

42. దేవహోతలు యజ్ఞము చేయువారు మానవ హోతలకన్న ప్రథములు, ప్రధానభూతులు. ఇంద్రుని యజ్ఞపు ప్రధాన అంగమున స్థాపించువారు. సురుచిర వాక్కుగలవారు. వారు అగ్ని వాయువులకు పూర్వదిశయందున్న ఆహవనీయ జ్యోతిని మధుఘృతధారల హవిస్సుచే అర్చింతురు.

43. హవివలన వర్ధిల్లువాడు ఇంద్రుడు. అతనిని సాధ్వులగు పత్నుల వలె సేవించువారు సర్వగమనలగు ఇడ, సరస్వతి, భారతి. ఆముగ్గురు దేవేరులు యజ్ఞతంతువును అవిచ్ఛిన్నము చేయుదురు గాత.

44. చతురుడు, యశస్వి, ఇంద్రునకు బలము కలిగించువాడు, సర్వత్రగామి, వర్షకుడు, వర్షక ఇంద్రుని పూజించువాడు, బలవంతుడునగు త్వష్ట యజ్ఞమునకు శిరస్థానమగు ఆహవనీయమున దేవతలను యజించును గాత.

45. యూపము - కసాయివలె - తనకు కట్టిన పశువులను దేవతలకు అర్పించును. అది యజ్ఞపశువుచే ఇంద్రుని కడుపు నింపును. అట్లే మధురఘృతమున యజ్ఞమును సుస్వాదువొనరించును.

46. వృషాయమానుడు, వర్షణశూరుడు, శత్రుపీడకుడగు ఇంద్రుడు వపాబిందురూప సోమపానము చేసి ప్రసన్నుడగును గాత. ఘృతబిందు మాత్రమున ప్రసన్నచిత్తులగు వారును, అమరులను అగు దేవతలు సహితము వపాసోమమున ఆనందమున తేలియాడుదురు గాత.

47. మమ్ము రక్షించుటకు ఇంద్రుడు ఇచటికి విచ్చేయును గాత. మాప్రశంసలు అందుకొను శూరఇంద్రుడు మాతో కలసి సోమపానము చేయును గాత. ఇంద్రుని పూర్వకర్మములు ద్యులోకము వలె స్తవనీయములు. అట్లు ఇంద్రుడు మమ్ము రక్షించుటకు దూరఅంతరిక్షము నుండి గాని సమీప పృథ్వినుండి గాని మావద్దకు రావలెను.

48. ఇంద్రుడు అభీష్టప్రదుడు. ఉగ్రుడు. మానవపాలకుడు. వజ్రబాహువు. యుద్ధమందు శత్రువును సత్వరమే నష్టపరచువాడు. అట్టి ఇంద్రుడు మమ్ము రక్షించుటకు దూరఅంతరిక్షము నుండి గాని సమీప పృథ్వినుండి గాని మావద్దకు రావలెను.

49. మమ్ము రక్షించుటకును హవిస్సులు అందుకొనుటకును, ఇంద్రుడు మాకు అభిముఖుడై త్వరత్వరగా విచ్చేయవలెను. ఇది అన్నప్రాప్తి కొరకగు యుద్ధము. వజ్రధారి, ధనవంతుడు, మహామహుడగు ఇంద్రుడు ఇచట ఉండవలెను. దీనిని రక్షించవలెను.

50. రక్షక ఇంద్రుని యుద్ధములకు ఆహ్వానించబడు ఇంద్రుని శూరఇంద్రుని పురుహోత ఇంద్రుని ఆహ్వానించుచున్నాను. అతడు మాకు శుభములు కలిగించవలెను.

51. ఇంద్రుడు సురక్షకుడు. సర్వజ్ఞుడు. సంపన్నుడు. రక్షించువాడు. అతడు మాకు సుఖములు కలిగించవలెను. అతడు ద్వేషులను వధించవలెను. మాకు నిర్భయత కలిగించవలెను. అతని దయచే మేము బలశాలురము కావలెను.

52. మేము ఇంద్రుని సద్బుద్ధియందును ప్రసన్నమనమునందును ఉండవలెను. సురక్షక, ధనశాలియగు ఇంద్రుడు మా శత్రువులను వేరుచేసి నష్టపరచవలెను.

53. ఇంద్రా! మయూర రోమముల మందగమనల హర్యశ్వములపై మాయజ్ఞమునకు విచ్చేయుము. మార్గమున దుష్టరాక్షసాదులు వేటకాడు పక్షిని పట్టినట్లు నిన్ను పట్ట కుండును గాత. వర్తకుడు త్వరత్వరగా ఎడారిని దాటి మంచి స్థలమునకు చేరినట్లు నీవు ఆటంకములను అధిగమించి మా యజ్ఞమును విచ్చేయుము.

54. వసిష్ఠగోత్రజులగు ఋషులు వర్షక, వజ్రబహు ఇంద్రుని మంత్రములచే సంస్తుతింతురు. ఇంద్రుడు మా స్తుతులను అందుకుని వీరపుత్ర యుక్త, గోయుక్త ధనమును ప్రసాదించవలెను. అతడు మమ్ము ఎల్లవేళల శుభములిచ్చి పాలించును గాత.

55. అశ్వినులారా! అగ్ని ప్రజ్వలితుడైనాడు. మహావీరఘటము కాలి సిద్ధమైనది. సోమరసము అభిషుతమైనది. ఇచట - ఈ యజ్ఞమునందున్న - సరస్వతి శుద్ధము, ఇంద్రునకు బలకారకమగు ఆవుపాలు పితుకుచున్నది.

56. ఆరోగ్య రక్షకులును, వైద్యులగు అశ్వినులిద్దరు మరియు సరస్వతి సోమము అభిషుతమైనంత జగములను మధువుచే పూరింతురు. వారు యజ్ఞమార్గమున ఇంద్రునకు బలము కలిగింతురు.

57. ఋత్విజులచే ప్రశంసనీయమైన యజ్ఞము ద్వారా సరస్వతి ఇంద్రునకు అభిషుతసోమము, సురాభాండము అందించినది. సోమము అభిషుతమైనంత వైద్యులగు అశ్వినులు ఇంద్రునకు మధురసరూపమును ప్రదానము చేసినారు.

58. ఇంద్రుని ఆహ్వానించునట్టి సరస్వతి ఇంద్రునకు నేత్రాది అవయవములను అందించినది.అశ్వినులు పశువుల అన్నము, ఓజస్సు ధనము ప్రదానము చేసినారు.

59. అశ్వినులు - ఇంద్రుని కొరకు - నముచి రక్తమును శుద్ధముచేసి, సోమరసమును అభిషుతము చేసినారు. సరస్వతి ఇంద్రుని దర్భాసనము మీద కూర్చుండ పెట్టినది. సోమరసమందు చిలికిన సురను చేర్చి ఇంద్రునకు - పానమునకు - అందించినది.

(ఒకసారి నముచి ఇంద్రునితో కలిసి సోమము సేవించినాడు. అప్పుడు అతని రక్తము సోమమైనది. ఇంద్రుడు

నముచిని వధించినాడు. అతని రక్తము పారినది. అశ్వినులు దానిని శుద్ధము చేసి సోమమును చేసినారని వృత్తాంతము)

60. శబ్దము, అవకాశముతో కూడిన ద్వారము. దిశలు, అశ్వినులు, సరస్వతి, ఇంద్రుడు ద్యావాపృథ్వ్యుల నుండి సకల మనోరథములను పితికినారు.

61. జ్ఞానియు, సుస్వరూపియునగు సరస్వతి సహితముగా ఉషోరాత్రులు, రాత్రింబవళ్లు, ఇంద్రునకు ఇంద్రియ బలము కలిగించుచుందురు.

62. అశ్వినులారా! మీరు మమ్ము పగళ్లందు రక్షించండి. సరస్వతీ! నీవు మమ్ము రాత్రులందు రక్షింపుము. అభిషుత సోమరసపాన నిమగ్న ఇంద్రుని దైవీహోతయు, అశ్వినూలును రక్షింతురు గాత.

63. అశ్వినులారా! మధ్యస్థానపు సరస్వతి - ద్యుస్థానపు భారతి - పృథివీస్థానపు ఇడయను ముగ్గురు దేవేరులు చిలికిన సురసహిత సోమమున ఇంద్రునకు అందించినారు.

64. సోమరసము అభిషుతమైనది. అప్పుడు అశ్వినులు, సరస్వతి, త్వష్ట అందు ఓషధులు, మధురూపభేషజము, యశస్సు, మున్నగునవి కలిపినారు. ఇంద్రునకు అందించినారు.

65. ప్రశంస్యమాన మనస్పతులు ఇంద్రునికొరకు అప్పుడప్పుడు వడకట్టిన సోమము మరియు మధువును సిద్ధము చేయును. అశ్వినులకు, ధేనుభూతయగు సరస్వతి తోడై మధుర దుగ్ధములను ఇంద్రునకు అందించును.

66. అశ్వినులారా! గోవు మున్నగు పశువులను 'మాసరము'ను జల్లించిన సురను అభిషుత సోమమును ఇంద్రునకు సమర్పించండి. వనస్పతులారా! మీరు సహితము సరస్వతి సహితులై ఇంద్రునకు సోమరసము సమర్పించండి.

67. అశ్వినులును సరసత్వియు తమ బుద్ధి బలమున నముచి శరీరము నుండి ఇంద్రుని కొరకు ఇంద్రియ బలము, పరిశుద్ధ సోమరసము, మహాధనమును తీసినారు.

68. అశ్వినులు, సరస్వతి ఇంద్రునకు హవిఅందించి అభివృద్ధిని చేసినారు. ఇంద్రుడు నముచిని వధించినాడు. నముచి తోటివాడగు ధనిక బలదైత్యుని ఇంద్రుడు వధించినాడు.

69. పశువులు, అశ్వినులు, సరస్వతి యజ్ఞములందు హవి అందించి ఇంద్రునకు బలము కలిగింతురు. ఇంద్రుని స్తుతింతురు.

70. సవిత, వరుణుడు, భగుడు, ఇంద్రునకు ఇంద్రియ బలము కలిగించినారు. ఇంద్రుడు చక్కని రక్షకుడు, హవిస్సులకు స్వామి. అతడు యజమానికి కోరిన వరములనీయవలెను. యజమానితో చేరవలెను.

71. సురక్షణల ఇంద్రుడు నముచి నుండి గుంజుకోని వచ్చిన బలధనాదులను హవి ప్రదాత యగు యజమానికి. సవిత మరియు వరుణుడు ప్రదానము చేయవలెను.

72. యజమాని కొరకు వరుణుడు క్షాత్రబలమును, సవిత సంపదలను, సురక్షణ గల ఇంద్రుడు యశముతోటి బలమును - అందించుచు యజ్ఞమునకు విచ్చేయుదురు.

73. అశ్వినులును, సరస్వతియు గోవుల వలన ఇంద్రియ బలమును, అశ్వముల వలన వీర్య బలమును హవి వలన ఇంద్రుని, యజమానిని వర్ధిల్లచేసినారు.

74. సుస్వరూపులు, సువర్ణ మార్గవర్తనులు, నరాకారులగు అశ్వినులు హవియుక్త సరస్వతి ఇంద్రుడును యజమానికి ఇంద్రియ బలము ప్రసాదింతురు గాత.

75. సుకర్మనులును, సరస్వతియు నముచిలో ఉన్న సురను పానము చేయుచు - యజ్ఞాది కర్మ రక్షకుడును, వ్యాపకుడును అగు ఇంద్రుని రక్షించవలెను.

76. అశ్వినులును, సరస్వతియు నముచిలో ఉన్న సురను పానము చేయుచు - యజ్ఞాది కర్మ రక్షకుడును, వ్యాపకుడును అగు ఇంద్రుని రక్షించవలెను.

77. ఇంద్రా! మాతాపితృలు బిడ్డలను రక్షించినరీతి - స్వకర్మ కౌశలమున అశ్వినులు నిన్ను రక్షించినారు. అంతియకాదు సరస్వతియు సరస్వతియు నిన్ను సేవించినది. నీవో సురమణీయ సోమరసమును స్వశక్తిచే పానము చేసినవాడవు!

78. అగ్ని యందు అశ్వములున్నవి. గోవులున్నావి. వృషభములున్నవి. మేషములున్నవి. ఆహ్వానములు ఉన్నవి. అగ్ని అన్నరసపాయి. సోమహుతివంతుడు. బుద్ధి ప్రదాత. ఉత్పాదకుడు. అట్టి అగ్నికి బుద్ధియందు నిలుపండి. హృదయమున శుద్ధి చేయండి.

79. శుద్ధి ఘృతము వలెను చర్మము పై సోమము వలెను అగ్నీ! ణీ జ్వాలా ముఖములందు హవిని ఆహుతి చేసినాము. నీవు ప్రసన్నుడవగుము. మాకు అన్నము, వీరపుత్రులను, గో, అశ్వ ధనమును, మహాకీర్తిని ప్రసాదించుము.

80. అశ్వినులు వెలుగు తోటి నేత్రములను, సరస్వతి ప్రాణము తోటి వీర్యమును, ఇంద్రుడు బలముతోటి ఇంద్రియ

బలమును యజమానికి ప్రసాదించినారు.

81. నాసత్య అశ్వినులారా! రుద్రమార్గమున రాకపోకలు సాగించువారలారా! మీరు గో, అశ్వయుక్త ధనసహితులై ఈ యజ్ఞమునకు విచ్చేయండి.

82. అశ్వినులారా! ఆ ధనము అన్యులకు అందనట్టిదియు శత్రువుల చేతికి చిక్కనట్టిదియు కావలెను.

83. బుద్ధిమాన్ అశ్వినులారా! బంగరు రంగుదియు, ధనమిచ్చునట్టిదియునగు అశ్వ, గోధనమును మాకు తెచ్చి ఇవ్వండి.

84. పవిత్ర కర్మలు కలదియు అన్నములు గల అన్నవతియు, బుద్ధి యందు ధనమును దాల్చునట్టి సరస్వతి మా యజ్ఞమును ఆశించవలెను.

85. సూనృతములకు ప్రేరణ కలిగించునదియు - సుబుద్ధిని చైతన్యవంతము చేయునట్టి సరస్వతి మా యజ్ఞమును భరించును గాత.

86. సరస్వతి తాన్ జ్ఞానమున మహాబలమును వెల్లడించును. సమస్త ప్రాణులందున్న బుద్ధిని ప్రదీప్తము చేయును.

87. విచిత్ర దీప్తుల ఇంద్రా! నిన్ను నిత్యము ఆశించు సోమరసము అభిషుతమైనది - అంగుళులు, దశా పవిత్రమున పవిత్రమైనవి. నీవు త్వరత్వరగా ఈ యజ్ఞమునకు రావలసినది.

88. ఇంద్రా! నీవు కర్మాభిప్రేతవు. స్తోత్రముల ప్రేరణ గల వాడవు. సోమాభిలాషిని. స్తోత్రాభిలాషివి. నీవు త్వరత్వరగా ఈ యజ్ఞమునకు రావలసినది.

89. హర్యశ్వఇంద్రా! అతి శీఘ్రముగా హవిరన్నముల కొరకు యజ్ఞమునకు విచ్చేయుము. సోమరసము అభిషుతమైనంత మా సోమరసమును ణీ పొట్టలో పోసుకొనుము.

90. అశ్వినా పిబతాం మధు సరస్వత్యా సజోషసా|
ఇంద్రః సుత్రామా వృత్రహా జుషన్తాం సోమ్యాంమధు||

అశ్వినులారా! సరస్వతి అభిమానముగల మీరు సోమరస పానము చేయండి. సుత్రాత, వృప్రహంత ఇంద్రుడు సహితము సోమరసమును సేవించును గాత.

విద్వాంసుడు, బహుభాషా వేత్త, కవి, కథకుడు, నవలాకారుడు, నాటకకర్త, బాల సాహిత్య రచయిత, విమర్శకుడు, చలన చిత్ర రచయిత, వ్యాసకర్త, అనువాదకుడు, వక్త, కార్మికోద్యమ కార్యకర్త, స్వాతంత్ర్యం సమరయోధుడు, ప్రగతి పథగామి, ప్రపన్నుడగు, దాశరథి రంగాచార్య విరచిత శ్రీమదాంధ్ర శుక్ల యుజుర్వేద సంహిత యందలి సేకాద్యాసందీహౌత్రాంతమగు ఇరువదవ అధ్యాయము ముగిసినది.

**సర్వేభవస్తు సుఖినః**

**జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతం |**

**ఆధారస్సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ||**

**ఇరువది ఒకటవ అధ్యాయము**

1. ఇమం మే వరుణ శ్రుధీ హవమద్య చ మృడయ
   త్వామవస్యురాచకే||

వరుణదేవా! నేడు నీవు మా ఆహ్వానమును ఆలకింపుము. నన్ను రక్షించుమని నేను నిన్నే పిలుచుచున్నాను.

2. నేను నిన్ను మంత్రయుక్తముగ నమస్కరించి ఆహ్వానించుచున్నాను. యజమాని హవి సహితుడై నీ రాకను ఆకాంక్షించు చున్నాడు.

వరుణా! నీవు కోపింపకుము. మా వద్దకు రమ్ము, మమ్ము తెలిసికొనుము.

అత్యంత ప్రశంసిత వరుణా! మా ఆయువును నష్టపరచకుము. "మాన ఆయుః ప్రమోషీః

3. అగ్నీ! నీవు పరమ విద్వాంసుడవు. నీవే వరుణ దేవుని క్రోధమును నివారింపుము. అత్యంత యజన కుశల, హవ్యవాహక, జాజ్వల్యమాన అగ్నీ! మమ్ము ద్వేషించువారి నుండి మమ్ము విడిపింపుము. మా పాపములను దూరము చేయుము.

4. అగ్నీ! నేడు ఉష వెడలినంత నీవు నీ రక్షణలచే మమ్ము రక్షించుటకు మా వద్దకు విచ్చేయుము. విశేష సాధన ఘృతమును ఆహ్వానించుము... వరుణుని అర్చింపుము. సుఖముల నిచ్చు వరుణునకు కడుపునిండుగ సోమాన్నము తినిపించుము. ఆదరణీయ ఆహ్వానము నీవు సహితము సమిధాదులచే అభివర్ధిల్లుము.

5. అదితి మహతి. శుభకర్మ జనయిత్రి. యజ్ఞపాలిక. ప్రభూత రక్షణవతి. జరహీన. ప్రభూత గమన. శుభ ఆశ్రయ.

శుభనీతివతి. అట్టి అదితిని మేము నేడు మమ్ము రక్షించమని ఆహ్వానించుచున్నాము.

6. ఓ యజ్ఞమయీ నౌకా! నీవు సురక్షణశీలవు. విస్తారవతివి. ప్రభాయుక్తవు. పాపరహితవు. ఆశ్రయవతివి. అదితి రూపవు. సునీతివి. ఛిద్ర రహితవు. దేవసంబంధివి. మాకు శుభములు కలుగవలెనని నిన్ను ఎక్కుచున్నాను. "ఆరోహేమాస్వస్తయే"

7. అచ్ఛిద్ర, అపాప, శతారిత్ర యజ్ఞరూప సునావను స్వశుభలకు ఆరోహించుచున్నాను.

8. మిత్రా వరుణులారా! మా మార్గములను ఘృత దుగ్ధములచే నింపుడు. నా లోకములను మధువుతో తడుపుడు.

9. మిత్రా వరుణులారా! మా జీవనమునకు గాను మీ దీర్ఘ బహువులను చాచండి. మా క్షేత్రములను ఘృత స్వరూప వర్ష జలమున తడపండి. నన్ను జనులందు గొప్పవాడని ప్రకటించండి. "మేమిత్రావరుణ హవేమ" మిత్రా వరుణులారా! మా ఆహ్వానమును ఆలకించండి.

10. అశ్వములు దేవరక్షక యజ్ఞమందు అపరిమిత గమనలు, స్వర్గీయలు, స్వర, వృక, రాక్షసుల నుంచి రక్షకులు, వాధ్యులను మా నుంచి నిర్మూలించునవి. అవి మాకు సుఖ కారకములు కావలెను.

11. అశ్వములారా! అన్నప్రాప్తికగు యుద్ధములందు మమ్ము రక్షించండి. ధనప్రాప్తి కగు యుద్ధములందును రక్షించండి. మీరు "విప్రా అమృతా ఋతజ్ఞః" మీరు ఈ మధు భాగమును పానము చేయండి. మదోన్మత్తులు కండి. చివరకు దేవమార్గమున స్వర్గమున పయనించండి.

12. అగ్ని వెలిగినాడు. వరణీయుడగు వాడు సమిధలచే సంపూర్ణముగా ప్రదీప్తుడయినాడు. గాయత్రి ఛందము మరియు సంవత్సరన్నర గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినవి.

13. పవిత్రకర్మ తనూనపాద అగ్ని దేహమును పవిత్రము చేయు సరస్వతి - ఉష్ణిక్ ఛందము, దివ్య హవిని వహించు గోవు ఇంద్రునకు బలముస, ఆయువు కలిగించినారు.

14. వనస్పతులతో కూడిన స్తుత్య అగ్ని, అమరము, ద్యోతమానమగు సోమము - అనుష్టుప్ - ఛందము, రెండున్నర ఏండ్ల గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

15. పూషతో పాటు దర్భాసనముగల అగ్ని - మరణము లేని స్త్రీణిబర్హి - బృహతీ ఛందము మూడేండ్ల గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

16. ద్యోతమాన ద్వారము, మహాదిశలు, బ్రహ్మ, బృహస్పతి, పంక్తి ఛందము, నాలుగేండ్ల గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

17. గొప్పవారును శోభస్కర రూపులును. అగు ఉషారాత్రులు, అమరులగు విశ్వేదేవతలు త్రిష్టుప్ ఛందము, పూర్ణ వయసు గల గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

18. దివ్యహోతవైద్యులు - ఇంద్రయుతులు, పరస్పర సంయుక్తలగు ఇంద్ర వాయువులు జగతీ ఛందము, పూర్ణ వయసు గల గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

19. ఇడ, సరస్వతి, భారతి యను ముగ్గురు దేవేరులు, ఇంద్రుని ప్రజయగు మరుత్తులు, విరాట్ ఛందము, ధేనువు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

20.క్షిప్రవ్యాపియగు అద్భుత త్వష్ట - పుష్టిని పెంచు ఇంద్రాగ్నులు - ద్విపాద ఛందస్సు- సేచన సమర్థ గోవు ఇంద్రాగ్నులు - ద్విపాద చంధస్సు - సేచన సమర్థ గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

21. సుఖములనిచ్చు వనస్పతులు, ధనోత్పన్నసవిత, కకుప్ ఛందము, వంధ్య గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

22. మంచి రక్షణల వరుణుడు ఇంద్రునకు యజ్ఞవైద్యము చేసినాడు. స్వాహా ఆకృతి గల వనస్పతులు, అతిచ్ఛందము, పెద్ద వృషభము ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

23. వసంతర్తువు, త్రివృత్ సోమము, రథన్తర పృష్ఠ సంస్తుతులగు వసువులు, వపారూపహవి ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

24. గ్రీష్మ ఋతువు, పంచదశ స్తోమము, బృహత్పృష్ఠ సంస్తుత రుద్ర దేవతలు యశముతోటి హవి ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

25. వర్ష ఋతువు. సప్త దశ స్తోమము, వైరూపపుష్ఠ సంస్తుత ఋభువులు, సిరితోటి హవి ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

26. శరదృతువు, ఏకవింశత్సోమము, శ్రీ, వైరాజ పుష్ఠ సంస్తుత ఋభువులు, సిరితోటి హవి ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

27. హేమంతము, త్రిణవస్తోమము, శక్వర పృష్ఠ సంస్తుత మరుత్తులు, బలముతో కూడిన హవి ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

28. శిశిరము, త్రయస్త్రింశ స్తోమము, రైవత పృష్ఠస్తుత అమర దేవతలు, సత్యయుక్త క్షాత్రము హవి ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

29. గోష్పాదమందున్న ఆహవనీయాగ్నియు, దైవీ హోత అగ్నియు, అశ్వినులును, సరస్వతియు ఇంద్రుని సమిధలచే యజింతురు గాత. ఆ యజ్ఞమున అజ, మేష, ధూమ్ర, మధు గోధుమ, బదరి, యవాంకురములు భేషజములగును. తేజస్సు, బలము, పాలు, సోమరసము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

30. దైవీహోత తనూనపాదగ్ని, అశ్వినులు, సరస్వతి ఇంద్రుని యజింతురు గాత. ఆ మధుమయ పథ యాగమందు అజ, మేష, బదరి, యవాంకుర, వ్రీహ్యంకురములు భేషజములగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

31. దైవీహోత తనూనపాదగ్ని, అశ్వినులు, సరస్వతి ఇంద్రుని యజింతురు గాథ. ఆ మధుమయ పథ యాగమందు అజ, మేష, బదరి, యవాంకురములు భేషములగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

32. ఋత్విజుల ప్రశంసలందుకొను దైవీ హోత ఇడ, సరస్వతి, అశ్వినులు ఇంద్రాదులను గోవృషభముల ద్వారా వర్ధిల్ల చేయుచు యజింతురు గాత. యవలు, బదరి, మధు; కర్కంధు భేషజములగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

33. దైవీ హోత, ఉన్ని వంటి కోమల బర్హి - వైద్యులు, నాసత్యులగు అశ్వినులు - సరస్వతి యజింతురు గాత. బలోపేత అశ్వము, సద్య ప్రసూత గోవు భేషజములగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

34. దైవీహోతలగు దిశల వంటి, అవకాశముగల, శబ్దాయమాన ద్వారములు, అశ్వినులు, సరస్వతి ఇంద్రుని యజింతురు గాత. ద్యావాపృథ్వుల సహితముగా సరస్వతి గోవై శుద్ధ జ్యోతి స్వరూప భేషజమగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

35. దైవీహోత సురూప ఉష, రాత్రి, అశ్వినులు, సరస్వతి ఇంద్రుని యజింతురు గాత. వారు చిత్తము, శ్రీసహితులై మాసర రూప ఓషధి, శ్యేన పత్రము మరియు కాంతిని ఇంద్రుని యందు చేర్చెదరు. దుగ్ధము, సోమము, సుర, ఘృతము,

మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

36. దైవీ హోతలు, దివ్యహోతలగు ఇడ, భారతి, సరస్వతి, అశ్వినులు ఇంద్రుని యజింతురు గాత. సరస్వతి దేవవాణిచే త్రిధాత్రు భేషజమగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత హోతా! యజింపుము.

37. దైవీహోతలగు ఇడ, భారతి, సరస్వతి, అశ్వినులు ఇంద్రుని యజింతురు గాత. సరస్వతి దేవవాణిచే త్రిధాత్రు భేషజమమగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

38. దైవీహోత, బలవంతుడు, సర్వహితుడగు త్వష్ట, అశ్వినులు, సరస్వతి ఇంద్రుని- వృక, సుర, మాసరములచే యజింతురు గాత. ఈ యజ్ఞము వలన ఇంద్రునకు ఓజస్సు. వేగము, వీర్యము, సిరి, యశస్సు కలుగును గాత. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

39. దైవీహోత, పశుసంస్కర్త యూపము- భయంకరుడు, క్రోధి, వ్యాఘ్రము వంటివాడు, శతక్రతువగు ఇంద్రుడును అన్నమున సరస్వతిని యజింతురు గాత. సరస్వతి ఇంద్రునకు కోపము, బలము కలిగించును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రుని యందు చేరును గాత. హోతా! యజింపుము.

40. దైవీ హోత అగ్నిని యజించును గాత. ఘృతమునకు స్వాహా. మేధలకు వేరువేరుగా స్వాహా. అశ్వినులకు అజ స్వాహా. సరస్వతికి మేష స్వాహా. సింహ బల ఇంద్రునకు వృషభ స్వాహా. భేషజులకు స్వాహా. సోమశక్తికి స్వాహా. ఘృత భక్షక దేవతలకు స్వాహా. వైద్యులను సేవించు అగ్నికి స్వాహా. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రునందు చేరును గాత. హోతా! యజింపుము.

41. దైవీహోత అశ్వినులను యజించును గాత. అశ్వినులు ఛాగపు వపచే మేదను సేవింతురు గాత. హోతా! హవిని హోమము చేయుము.

దైవీ హోత సరస్వతిని యజించును గాత. సరస్వతి మేష వపచే మేదను ఆస్వాదించును గాత. హోతా! హవిని హోమము చేయుము.

దైవీ హోత ఇంద్రుని యజించును గాత. ఇంద్రుడు వృషభాపు వపచే మేదను ఆస్వాదించును గాత. హోతా! హవిని హోమము చేయుము.

42. దైవీ హోతలు అశ్వినులు, సరస్వతి ఇంద్రుని యజింతురు గాత. అధ్వర్యులారా! ఓహో! మీ సోమము ఎంతో

బాగున్నది. అది ఛాగ, మేష, వృషభములచే అభిషుతమై ఉన్నది. అది తృణ, యవాంకుర, లాజలతో తేజరిల్లుచున్నది. అది మసరములచే శుద్ధి చేయబడి మరింత మత్తు కలిగించునదై ఉన్నది. ఓహో! ఇహ పాలు కలసి ఇది అమృతమైనది. దేవతలు ఇటువైపు తరలినారు. అశ్వినులు, సరస్వతి- సుత్రాత, వృత్రహంత ఇంద్రులారా! మీరు ఈ మధుర రసమును  పానము చేయండి, సకల దేవతలారా! దీనిని సేవించండి. మదోన్మత్తులు కండి. హోతా! యజింపుము.

43. దైవీహోత అశ్వినులను యజించును గాత. నేడు అశ్వినులు ఛాగమాంసమును తినవలెను. అది మధ్య నుంచి మేద తీయబడినది. రాక్షసాది శత్రువులు భక్షించక మున్నే  మాంసాహార మానవులు ఎగబడక మున్నే అశ్వినులు దీనిని భక్షించవలెను.

ఇది - ఈ ఆడ మేక- పచ్చని గడ్డిమీద సంచరించినది. యవల తొలి మొక్కలను మేసినది. అది స్వయముగా కరిగినది. వందల స్తుతులచే స్తుత్యుడగు అగ్నిచే పచనము చేయబడినది. ప్రతి అంగమును బయటకు తీసి ఒక్కొక్క దానిని కోసి చేసిన మాంస వపా ఖండములను అశ్వినులు ఆస్వాదించవలెను. ఆనందించవలెను. హోతా! యజింపుము.

44. దైవీహోత సరస్వతిని యజించును గాత. నేడు సరస్వతి మేక మాంసమును భక్షించవలెను.

అది మధ్య నుండి మేద తీయబడిన మాంసము. రాక్షసాది శత్రువులు భక్షించక మున్నే, మాంసాహార మానవులు ఎగబడక మున్నే సరస్వతి దానిని భక్షించవలెను.

ఈ మేక పచ్చని గడ్డిమీద సంచరించినది. యవల తొలి మొక్కలు మేసినది. అది స్వయముగా కరిగినది. వందల స్తుతులచే స్తుత్యమగు అగ్నిచే పచనము చేయవబడినది. ప్రతి అంగమును బయటకు తీసి ఒక్కొక్క దానినికోసి చేసిన మాంసవపా ఖండములను సరస్వతి ఆస్వాదించవలెను. ఆనందించవలెను. హూతా! యజింపుము.

45. దైవీ హోత ఇంద్రుని యజించును గాత. ఇంద్రుడు వృషభ మాంసమును భక్షించవలెను.

అది మధ్య నుండి మేద తీయబడిన మాంసము. రాక్షసాది శత్రువులు భక్షించక మున్నే మాంసాహార మానవులు ఎగబడక మున్నే ఇంద్రుడు దానిని భక్షించవలెను.

ఈ ఎద్దు పచ్చని గడ్డిమీద సంచరించింది. యవల తొలి మొక్కలు మేసినది. అది స్వయముగా కరిగినది. వందల స్తుతులచే స్తుత్యుడగు అగ్ని దానిని పచనము చేసినాడు. ప్రతి అమ్గామును బయటికి తీసి ఒక్కొక్క దానిని కోసి చేసిన మాంస వపా ఖండములను ఇంద్రుడు ఆస్వాదించవలెను. ఆనందించవలెను. హోతా! యజింపుము.

46. దైవీహోత యూపమును యజించును గాత. ఈ యూపము గట్టి త్రాళ్ళతో పశువులను హనకు కట్టి ఉంచునది. ఈ యూపము దేవతలకు ఉపకారము చేయునది. ఈ యూపమే అశ్వినుల ఛాగ హవి లభ్యస్థానము. సరస్వతి మేషహవి లభ్యస్థానము. ఇంద్రుని వృషభ హవి లభ్య స్థానము.

ఈ యూపము అగ్ని యొక్క హవికి ప్రియస్థానము. సోమపు, సుత్రాత ఇంద్రుని, సవిత యొక్క, వరుణుని హవికి ప్రియ స్థానము. ఇది యూపమునకు అన్న స్థానము. ఘృత పాయి దేవతలకు - హోత అగ్నికి ప్రియస్థానము.

వనస్పతి రూపయూపమా! పశువులను అత్యంత విక్షుబ్ధము చేసి - స్తుతి, ఉపస్తుతులచే వానిని ఆయా స్థానములందు స్థాపించుము. వనస్పతి దేవత హవిని ఆరగించును గాత. హోతా! యజింపుము.

47. దైవీహోత కళ్యాణకారి అగ్నిని యజించును గాత. అగ్ని అశ్వినుల ఛాగ మాంసపు ప్రియ స్థానమును యజించినాడు. అగ్ని - సరస్వతి మేష మాంసపు ప్రియస్థానమును యజించినాడు. అగ్ని - ఇంద్రుని వృషభమాంసపు ప్రియస్థానమును యజించి నాడు.

అగ్ని తన ప్రియ స్థానములను యజించినాడు. సోమపు ప్రియస్థానములను యజించినాడు. సవిత ప్రియస్థానములను యజించినాడు, సుత్రాత ఇంద్రుని ప్రియ స్థానములను యజించినాడు. వరుణుని ప్రియ స్థానములను యజించినాడు. వనస్పతి యూపపు ప్రియ అన్న స్థానములను యజించినాడు. ఘృతపాయి దేవతల ప్రియ స్థానమును యజించినాడు. స్వయముగా తన మహిమను యజించినాడు.

అగ్ని యజ్ఞములను సేవించును గాథ. హోతా! యజింపుము.

48. దర్భయే దేవత. అశ్వినులు, సరస్వతి, ఆ దర్భచేతనే ఇంద్రుని కనులకు వెలుగును, చూపును కలిగించినారు. ధనము సమకూర్చుటగాను అశ్వినులు, సరస్వతి, ఇంద్రుడు హవిని ఆరగించవలెను. హోతా! యజింపుము.

49. యజ్ఞశాలకు ద్వారా దేవేరున్నారు. వారితో కలసి వైద్య అశ్వినులు, సరస్వతియు, ఇంద్రునకు బలము సమకూర్చినారు. ఇంద్రుని నాసిక యందు ఘ్రాణేంద్రియమును, ప్రాణమును ఏర్పరచినారు. ఇంద్రునకు ధనము కలుగుటకు గాను అతనికి శక్తి కలిగించినారు. ఇంద్రాదులు హవిని గ్రహించవలెను. హోతా! యజింపుము.

50. ఉషాయు రాత్రియు యుగళ దేవతలు, అశ్వినులు, సరస్వతి ఉషారాత్రులతో కలసి ఇంద్రునకు బలము కలిగించినారు. వారు ఇంద్రుని నోట వాగింద్రియమును కూర్చినారు. ఇంద్రునకు ధనము కలుగుటకు గాను అతనికి శక్తి, స్తోమతలు కలిగించినారు. హోతా యజింపుము.

51. ద్యావాపృథ్వులతో కలసి అశ్వినులు, సరస్వతి ఇంద్రుని అభివర్ధితుని చేసినారు. ఇంద్రుని కర్ణమున

శ్రోత్రేంద్రియమును ఏర్పచినారు. అతనికి కీర్తి కలిగించినారు. ఇంద్రునకు ధనలాభము కలిగించుటకు అతనికి శక్తి స్తోమతలు కలిగించినారు. ఆ ఇంద్రాదులు హవిని ఆరగింతురు గాథ. హోతా! యజింపుము.

52. శక్తి, ఆహుతి అను దేవేరులు దుధ, సుదధలగుదురు. వారితో కూడి అశ్వినులు- సరస్వతి ఇంద్రునకు రక్షణలు కలిగించినారు. ఇంద్రునిలో తేజము, హృదయ బలము కలిగించినారు. ధనలాభము కలిగించుటకు ఇంద్రునకు శక్తి స్తోమతలు కలిగించినారు. ఇంద్రాదులు హవిని ఆరగింతురు గాత. హోతా! యజింపుము.

53. దేవతల ఇద్దరు దేవహోతలు అగ్ని - వాయువులు. వారితో కూడి అశ్వినులు సరస్వతి, వషట్కారములు ఇంద్రుని యందు తేజస్సు ప్రవేశపెట్టినారు. హృదయమున మతిని కలిగించినారు. ధనలాభము కలిగించురకు ఇంద్రునకు శక్తి స్తోమతలు కలిగించినారు. ఇంద్రాదులు హవిని ఆరగింతురు గాత. హోతా! యజింపుము.

54. ఇడ, భారతి, సరస్వతిలో కూడి అశ్వినులు, సరస్వతి బలమును కలిగించినారు. నాభియందు అగ్నిని స్థాపించినారు. ధనలాభము కలిగించుటకు ఇంద్రునకు శక్తి స్తోమతలు కలిగించినారు. ఇంద్రాదులు హవిని ఆరగింతురు గాత. హోతా! యజింపుము.

55. ఇది ఋత్విజులు చేయు ప్రశంసనీయ యజ్ఞము. ఇది సత్ హవిర్ధానము గలది. ఇది అగ్నీధ్రనామక యజ్ఞము. దీని రథమును అశ్వినులు, సరస్వతి లాగుదురు. ఈ యజ్ఞము ఇంద్రుని యందు వీర్యము, అందము, అమృతము, ఉత్తమ జన్మము కలిగించును గాత. ఈ యజ్ఞమే జగత్ స్రష్టయగు త్వష్ట అగుచున్నది. హోతలారా! ఇంద్రాదులు హవిభక్షణ చేయునట్లు యజించండి.

56. దేవతలు బంగారు పత్రముల వృక్షమునుకు అశ్వినులును, సరస్వతి సుందర ఫలములగుదురు. వారును, వనస్పతి యూప దేవతయు ఇంద్రునకు సోమాది హవి ఫలములను ఇచ్చినారు. వారు మాకు తేజము, ఓజము, వేగము, సామర్థ్యము కలిగింతురు గాత.

ఆ దేవతలు ధనలాభము కొరకు శక్తి స్తోమతలు కలిగించుటకు ఇంద్రాదులు హవిని భక్షింతురు గాత. హోతా! యజింపుము.

57. దర్భ ఓషధ సంబంధి ఉన్ని వలె కోమలము, సుఖకరము - అశ్వినులును, సరస్వతి దర్భాసనము పరచినారు. ఇంద్రా! యజ్ఞమున ఇది నీకు సుఖకరమగును గాత. అశ్వినులు, సరస్వతి దర్భతో కూడి సంపద, దీప్యమానమన్యు, శక్తిని కలిగించుటకు ఇంద్ర సహితులై హవిని భక్షింతురుగాక. హోతా! యజింపుము.

58. శుభయాగ కుశల అగ్ని - దైవీ హోత అగ్ని, వాయువు, ఇంద్రుడు, అశ్వినులు సరస్వతి మరియు సోమమును యథాక్రమము యజించినారు. వారు వాణిని వాణిచే పూజించినారు. సుత్రాత ఇంద్రుడు చక్కగా పూజింపబడినాడు.

సవిత, వరుణుడు, వనస్పతి యూపదేవుడు సహితము చక్కగా పూజించబడినారు. దైవీ అగ్ని భౌతిక అగ్నిచే చక్కగా పూజించబడినది. మంచి పూజలందుకొను దేవహోత మానవ హోతకు కీర్తి, శక్తి, బలము, పూజ, పితరులకు అన్నము ప్రసాదింతురు గాత. ఇంద్రునకు ధనము కలిగించుటకు ఈ దేవతలందరు హవిని భక్షింతురు గాత. హోతా! యజింపుము.

59. యజమాని - పక్వయోగ్య హవిస్సులను పచనము చేయుచు పురోడాశమును వండుచు అశ్వినుల కొరకు భాగమును, సరస్వతి కొరకు మేషమును, ఇంద్రుని కొరకు వృషభయమును యూపమునకు బంధించుచు అశ్వినులు, సరస్వతి, ఇంద్రుని కొరకు సోమము అభిషుతము చేయుచు నేడు వాస్తవముగా అగ్నిని పూజించుచున్నాడు.

60. అశ్వినులు కొరకు ఛాగము, సరస్వతి కొరకు మేషము, ఇంద్రుని కొరకు వృషభములను ధరించి వాస్తవయూపముగ వనస్పతి దేవత యజ్ఞమునకు ఉపస్థితుడు అగుచున్నాడు. అశ్వినులు మున్నగు దేవతలు పశువుల మేదచే ప్రారంభించి శేషాంగములను భక్షించినారు. వండిన పశు శరీర భాగములను కూడా వారు స్వీకరించినారు. అశ్వినులు, సరస్వతి, సుత్రాత ఇంద్రుడు వానిని భక్షించి వర్ధిల్లినారు. వారు సురా, సోమములను సహితము పాణము చేసినారు.

61. ఋషిపుత్రా! ఋత్విజ అగ్నీ! నేడు ఈ యజమాని ఇందరు ఋత్విజులు ఉండగా నిన్నేల వరించినాడు? ఏలననగా ఈ అగ్ని దేవతలు అందించు వరణీయ ధనమును యజమానికి అందించును, యజమాని సమర్పించు హవిస్సులను దేవతలకు అందించును.

ద్యోతమాన అగ్నీ! దేవతలు యజమానికి దానములు ఇచ్చునట్లు ప్రయత్నించుము. దేవతలు ఇచ్చిన దానములను పలుకుటకు మానవహోత కూడ పంపబడినాడు. హోతా! నీవు సూక్తములు పలుకుము. "సూక్తాబ్రూహి"

దాశరథి రంగాచార్య విరచిత

శ్రీమదాంధ్ర వచన శుక్ల యజుర్వేద సంహితయందలి

యాజ్యాది ప్రేషణమంత్ర యుక్తమగు

ఇరువది ఒకటవ అధ్యాయము సమాప్తము.

సర్వేభస్తు సుఖినః

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతం |

ఆధారస్సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ||

## ఇరువది రెండవ అధ్యాయము

1. తేజోऽసి శుక్రమమృతమాయుష్పా ఆయుర్మేపాహి|
దేవస్య త్వా సవితుః ప్రసవేऽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామాదదే||

(అథాశ్వామేధశ్చతుర్భిరాధ్యాయైః తస్యఫాల్గుణశుక్లష్ట మ్యామారమ్భః నిష్కం ప్రతి ముంచన్వాచయతి. ఈనాలుగు అశ్వమేధ అధ్యాయములు ఇది ఫాల్గుణశుక్ల అష్టమినాడు ఆరంభమగును. నాలుగు బంగారునాణెముల హారము నిష్కమగును. అధర్యు దానిని యజమాని మెడలో వేయును.)

నిష్కమా! నీవు తేజస్సువు. పరిశుద్ధమవు. అమృతమవు. ఆయువును. రక్షించుదానవు. ఆయుర్మేపాహి - నాఆయువును రక్షింపుము.

(అశ్వమును కట్టు త్రాడు తీసికొనవలెను)

రజ్జువా! సవితాదేవుని అనుజ్ఞలో వర్తిల్లు నేను అశ్వినుల బాహువులతోను పూషహస్తములతోను నిన్ను అందుకొనుచున్నాను.

2. యజ్ఞముల చరిత్రలో పూర్వకాలమందలి యజ్ఞములందు కూడ ఈరజ్జువునే అందుకున్నారు. యజ్ఞము ప్రారంభమై సోమము అభిషుతమై యజ్ఞము ముందునకు సాగినపుడు మేము ఈత్రాటిని అందుకున్నాము.

3. (గుర్రమునకు కట్టమని బ్రహ్మ ఆదేశించును. అధ్వర్యు ఆ త్రాటిని గుర్రమునకు కట్టును.)

అశ్వమా! నీవు 'స్తుత్య' నామకవు. నీవు అందరకు ఆశ్రయమవు. అందరను నియంత్రించు దానవు. భరించుదానవు. స్వాహా అన్నంత నీవు సర్వహితకారియు విస్తరించు వాడగు - అగ్నిని చేరుకోనుము

4. అశ్వమా! నేను దేవతలు మరియు ప్రజాపతి కొరకు నిన్ను తెచ్చినాను. నిన్ను స్వయముగా దేవతలు, ప్రజాపతి వద్దకు చేరునట్లు చేయుదును.

(అధ్వర్యు అనుచున్నాడు) బ్రహ్మే! నేను దేవతలు మరియు ప్రజాపతి కొరకు ఈ అశ్వమును బంధింతును.

(బ్రహ్మ అనుచున్నాడు) నీవు అశ్వమును దేవతల కొరకును ప్రజాపతికొరకును బంధించుము. యజ్ఞసిద్ధిని పొందుము.

5.(ప్రోక్షత్యశ్వమ్. అశ్వమును ప్రోక్షించవలెను)

అశ్వమా! నీవు ప్రజాపతికి ప్రియమవు. నిన్ను ప్రోక్షించుచున్నాను. నీవు వాయువునాకు ప్రియమవు. నిన్ను ప్రోక్షించుచున్నాను. నీవు ఇంద్రాగ్నులకు ప్రియమవు. నిన్ను ప్రోక్షించుచున్నాను. నీవు విశ్వేదేవతలకు ప్రియమవు. నిన్ను ప్రోక్షించుచున్నాను. నీవు సకల దేవతలకు ప్రియమవు. నిన్ను ప్రోక్షించుచున్నాను.

(అధ్వర్యు ఆదేశమున శూద్రునకు వేశ్య వలన పుట్టినవాడు, నాలుగు కనుల కుక్కను చంపవలెను. అప్పుడు అధ్వర్యు యజమానిచే అనిపించవలసినది)

'యో అర్వన్తం జిఘాంసతి తమభ్యమీతి వరుణః' అశ్వమును చంపదలచిన వానిని వరుణుడు వధించును.

(చచ్చిన కుక్కను ఎదురు చాపమీద పెట్టి గుర్రపు క్రింది నీటిలో తేల్చవలెను)

చంపువాడు దూరమైనాడు. కుక్క దూరమైనది - "పరోమర్తః - పరాశ్వ"

(యస్య శునశ్చక్షుషోసమీపే పుణ్డ్రేస్తః సచతురక్ష ఉచ్యతే. కనుల వద్ద నామమున్న కుక్కను నాలుగు కనులది అందురు.)

6. (గుర్రమును నీటినుండి తెచ్చి స్తోకీయమను పదిలేక వేయి ఘృతాహుతులు ఇవ్వవలెను)

అగ్నయే స్వాహా, సోమాయ స్వాహా. అపాంమోదాయ - జలములముదమునకు స్వాహా. సవిత్రే స్వాహా. వాయువే స్వాహా. విష్ణవే స్వాహా. ఇంద్రాయ స్వాహా. బృహస్పతయే స్వాహా. మిత్రాయస్వాహా. వరుణాయ స్వాహా.

7. హింకారాయ స్వాహా. హింకృతాయస్వాహా. క్రన్దనే స్వాహా. అవక్రందాయ స్వాహా. ప్రొథతే స్వాహా. ప్రప్రోథాయ స్వాహా. గంధాయ స్వాహా. ధాత్తాయ స్వాహా. నివిష్ఠాయ స్వాహా. ఉపవిష్ఠాయ స్వాహా. సందితాయ స్వాహా. వల్గతే స్వాహా. ఆసీనాయ స్వాహా. శయనాయ స్వాహా. స్వపతే స్వాహా. జాగ్రతే స్వాహా. కూజతే స్వాహా. ప్రబుద్ధాయ స్వాహా. విజృంభమాణాయ స్వాహా. విచృతాయ స్వాహా. సంహానాయ స్వాహా. స్వాహూపస్థితాయ స్వాహా. స్వాహాయనాయ స్వాహా ప్రాయణాయ స్వాహా.

8. పరిగెత్తు వారికి స్వాహా. వేగవంతునకు స్వాహా. క్షిప్రగతికి స్వాహా. కూర్చున్నవారికి స్వాహా. లేచినవారికి స్వాహా. తిరుగువారికి స్వాహా. తిరుగని వారికి స్వాహా. బలమునకు స్వాహా. వేగమునకు స్వాహా. కుండ కదిలించువానికి స్వాహా. వాడకువానికి స్వాహా. సేవితునకు స్వాహా. వినువానికి స్వాహా. చూచువానికి స్వాహా. చూడబడువానికి స్వాహా. రెప్పవేయువానికి స్వాహా. తిన్నదానికి స్వాహా. త్రాగినదానికి స్వాహా. మూత్రించుటకు స్వాహా. కర్మకారికి స్వాహా. కర్మ చేసినవానికి స్వాహా.

9. తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి|
ధియోయోనః ప్రచోదయాత్ ||

సవితృ దేవత పాపభర్జనకారి. వరణీయుడు. మేము అతని తేజమును దాల్తుము. ఆ తేజము మా బుద్ధులను సత్కర్మలకు ప్రేరేపించును గాత.

10. హిరణ్యసవితను నన్ను రక్షింపుమని ఆహ్వానించుచున్నాను. అతడు జ్ఞానియగు దేవత. స్వర్గాది ఉత్తమ పదములు అతనికే తెలియును.

11. సవిత సర్వజ్ఞుడు. అతని చిత్తము మహత్తము, సత్యసాధకము. మేము సవిత మంచి మనసును యాచించుచున్నాము.

12. సవిత సుమతిని పెంచువాడు. అందరి చిత్తములను ఎరిగినవాడు. మేము అతనిని చక్కగా స్తుతింతుము. అతని దానమును యాచింతుము.

13. సవిత శ్రేష్ఠజనుల పాలకుడు. శుభకర్మ ప్రేరకుడు. దేవతల తర్పణకు గాను సవిత దానమును యాచించుచున్నాము.

14. సకల దేవతల తర్పణకుగాను ప్రేరక సవితా దేవుని సంపదను సద్బుద్ధిచే యాచించుచున్నాము.

15. అధ్వర్యులారా! అమర అగ్నికి సమిధలు అర్పించండి. ప్రబుద్ధుని చేయండి. జాగృతుడగు అగ్ని మాహవిస్సులను దేవతలకు చేర్చును గాత.

16. అగ్ని హవ్యవాహనుడు. అమరుడు. కోరదగినవాడు. దూత. హితుడు. స్తుతులు అందుకొనును. దేవతల వద్దకు చేర్చును.

17. అగ్నిదూత. అతనిని ణా ముందు స్థాపించుచున్నాను. ఈ యజ్ఞమును దేవతలను తెమ్మని హవ్యవాహుని ప్రార్థించుచున్నాను.

18. పవిత్రకారి సోమమా! నీవు శక్తిమంతుడవు. సూర్యుని వెల్లడించినావు. ధారాగతిగల నీవు గోవులు మున్నగు పశువులకు జీవనమునిచ్చు వర్షము కలిగింతువు.

19. అశ్వమా! నీవు భూమాత సంబంధమున ఎంతో సమర్థుడవు. ద్యుపిత సంబంధమున ఎంతో

ప్రభుతవంతుడవు. అశ్వ, హయ, అర్వ, సప్తి, వాజి, వృష, యాజమాన, యయు, శిశు నామములు గలదానవు. నీవు దేవ మార్గము చేరుకోనుము.

దిక్పాలదేవతలారా! ఇది అశ్వము. దేవతల నిముత్తము జలముచే పవిత్రము చేయబడినది. దీనిని మీరు ఎల్లవేళల రక్షించండి.

అశ్వమా! ఇది నీవు ఆనందించుచోటు. ఇచట ఆనందించుము. ఇది నీవు నిలుచు స్థలము. ఇచట నిలుపుము. సుఖంపుము - స్వాహా.

20. ప్రజాపతయే స్వాహా. కస్మైస్వాహా. కతమస్మైస్వాహా. స్వాహాధిమాధీతాయస్వాహా. మనః ప్రజాపతయేస్వాహా. చిత్తం విజ్ఞాతాదిత్యై స్వాహా. ఆదిత్యైమహ్యై స్వాహా. ఆదిత్యైసుమృడీకాయైస్వాహా. సరస్వత్యై స్వాహా. సరస్వత్యై పావకాయై స్వాహా. సరస్వత్యై బృహత్యై స్వాహా. పూష్ణేస్వాహా. పూష్ణేప్రపథ్యాయ స్వాహా. పూష్ణే నరధిశాయస్వాహా. త్వష్ణేస్వాహా. త్వష్ణే తురీపాయస్వాహా. త్వష్ణే పురురూపాయస్వాహా. విష్ణవేస్వాహా. విష్ణవే నిభూయపాయస్వాహా. విష్ణవే శిపివిష్టాయ స్వాహా.

(ఇవి ఔద్గాభణ మంత్రములు)

21. మానవనేతలందరు సవితాదేవుని మైత్రి కోరుకుందురు. అందరు ధనము కోరుకుందరు. సంతానాదుల పోషణకు అన్నాదులు కోరుకుందురు. సవితాయస్వాహా.

22. బ్రహ్మ! మాదేశమున యజ్ఞమును అధ్యయనశీల బ్రాహ్మణులును జన్మింతురు గాత. శూరులు, లక్ష్యభేదులు, ధరుర్ధారులు మహారథులగు క్షత్రియులు జన్మింతురు గాత. పాడియావులు, బరువులు మోయు ఎద్దులు, వ్యాపనశీల అశ్వములు, మనోహరస్త్రీలు, ఈయజమానికి జయశీల, రాథారోహి, సభాకుశల, సేచన సమర్థపుత్రులు జన్మింతురు గాత. నికామే నిజామే నః పర్జన్యోవర్షతు. కోరినంత పర్జన్యుడు వర్షము కలిగించును గాత. ఓషధులు ఫలించును గాత. యోగక్షేమో నః కల్పతామ్ - మాకు యోగక్షేమములు కలుగును గాత.

(యోగక్షేమం వహామ్యహమ్ అన్నాడు శ్రీ కృష్ణభగవానుడు శ్రీ మద్భగవద్గీతలో)

23. ప్రాణాయ స్వాహా. అపానాయ స్వాహా. వ్యానాయస్వాహా. చక్షుషేస్వాహా. శ్రోత్రాయస్వాహా. వాచే స్వాహా. మనసే స్వాహా.

24. ప్రాచ్య దిశకు స్వాహా. అర్వాచిదిశకు స్వాహా. దక్షిణ దిశకు స్వాహా. ఆర్యాచ్య దిశకు స్వాహా. ప్రతీచ్యదిశకు స్వాహా. అర్యాచ్యదిశకు స్వాహా. ఉదీచిదిశకు స్వాహా. అర్వాచిదిశకు స్వాహా. ఊర్ధ్వదిశకు స్వాహా. అర్వాచ్యదిశకు

స్వాహా. అర్వాచ్యదిశకు స్వాహా. ఆర్యాచ్యదిశకు స్వాహా.

25.అద్భ్యః స్వాహా. వాభ్యః స్వాహా. స్వాహూదకాయ స్వాహా. తిష్టన్తీ భ్యః స్వాహా. స్రవన్తీభ్యః స్వాహా. స్యన్దమానేభ్యః స్వాహా. కూప్యాభ్యః స్వాహా. సూద్యాభ్యః స్వాహా. ధార్యాభ్యః స్వాహా. అర్ణవాయస్వాహా. సముద్రయస్వాహా. సరిరాయ స్వాహా.

26. వాతమునకు స్వాహా. ధూమమునకుస్వాహా. స్వాహాభ్రాయస్వాహా. మేధకు స్వాహా. విద్యోతమానమునకు స్వాహా. స్తనయతమునకు స్వాహా. స్ఫూర్జితమునకు స్వాహా. వర్షమునకు స్వాహా. వవర్షమునకు స్వాహా. అగ్రవర్షమునకు స్వాహా. శీఘ్రవర్షమునకు స్వాహా. ఉద్గ్రిహణమునకు స్వాహా. ప్రుష్ణతమునకు స్వాహా. శీకాయతమునకు స్వాహా. పుష్పములకు స్వాహా. హ్లాదునిలకు స్వాహా. నీహారాయ స్వాహా.

27. అగ్నయే స్వాహా. సోమాయస్వాహా. ఇంద్రాయస్వాహా. పృథివ్యై స్వాహా. అంతరిక్షయస్వాహా. దివేస్వాహా. దిగ్భ్యాం స్వాహా. ఆశాభ్యః స్వాహా. ఉర్వ్యై స్వాహా. దిశే స్వాహా. అర్యాచ్యైదిశే స్వాహా.

28. నక్షత్రేభ్యః స్వాహా. నక్షత్రిభ్యః స్వాహా. అహూరాత్రే భ్యః స్వాహా. అర్ధమాసేభ్యః స్వాహా. మాసేభ్యః స్వాహా. ఋతుభ్యః స్వాహా. అర్తవేభ్యః స్వాహా. సంవత్సరాయ స్వాహా. ద్యావాపృథివీభ్యాం స్వాహా. చంద్రయస్వాహా. సూర్యాయస్వాహా. రశ్మిభ్యః స్వాహా. వసుభ్యః స్వాహా. రుద్రేభ్యః స్వాహా. ఆదిత్యైభ్యః స్వాహా. మరుద్భ్యః స్వాహా. విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా. మూలేభ్యః స్వాహా. శాఖాభ్యః స్వాహా. మనస్పతిభ్యః స్వాహా. పుష్పేభ్యః స్వాహా. ఫలేభ్యః స్వాహా. ఓషధీభ్యః స్వాహా. పుష్పేభ్యః స్వాహా, ఫలేభ్యః స్వాహా ఓషధీభ్యః స్వాహా.

29. పృథివ్యై స్వాహా. అంతరిక్షాయ స్వాహా. దివేస్వాహా. సూర్యాయ స్వాహా. చన్ద్రాయస్వాహా. నక్షత్రేభ్యః స్వాహా. అద్భ్యః స్వాహా. ఓషధీభ్యః స్వాహా. వనస్పతీభ్యః స్వాహా. పరిప్లవేభ్యః స్వాహా. చరాచరేభ్యః స్వాహా. సరీసృపేభ్యః స్వాహా.

30. అసవేస్వాహా, వసవేస్వాహా, విభువేస్వాహా. వివస్వతేస్వాహా. గణశ్రయేస్వాహా, గణపతయేస్వాహా, అభిభువేస్వాహా. అధిపతయేస్వాహా, సూషాయస్వాహా. సంసర్పాయస్వాహా. చన్ద్రాయస్వాహా. జ్యోతిషేస్వాహా. మలిమ్లుచాయస్వాహా. దివాపతయేస్వాహా.

31. మఘవేస్వాహా. మాధవాయస్వాహా, శుక్రాయస్వాహా. శుచయేస్వాహా. నభసేస్వాహా. నభస్యాయస్వాహా. ఉషాయస్వాహా. ఊర్జాయస్వాహా. సహసేస్వాహా. సహస్యాయస్వాహా. తపసేస్వాహా. తపస్యాయస్వాహా. అ హసస్పతయే స్వాహా.

32. వాజాయ స్వాహా. ప్రసవాయ స్వాహా. ప్రసవాయ స్వాహా. అపిజాయిస్వాహా. క్షతవే స్వాహా. స్వః స్వాహా.

మూర్ధ్నే స్వాహా, వ్యశ్నువనే స్వాహా. అన్త్యాయ స్వాహా. భౌవనాయస్వాహా. భువనస్యపతయే స్వాహా. అధిపతయే స్వాహా. ప్రజాపతయే స్వాహా.

33. యజ్ఞము వలన ఆయువు లభించును గాత. స్వాహా. యజ్ఞము వలన ప్రాణము లభించును గాత. స్వాహా. యజ్ఞము వలన అపానము లభించును గాత. స్వాహా. యజ్ఞము వలన వ్యానము లభించును గాత. స్వాహా. యజ్ఞము వలన ఉదానము లభించును గాత. స్వాహా. యజ్ఞము వలన సమానము లభించును గాత. స్వాహా. యజ్ఞము వలన నేత్రము లభించును గాత. స్వాహా యజ్ఞము వలన శ్రోత్రములు లభించును గాత. స్వాహా యజ్ఞము వలన వాక్కు లభించును గాత. స్వాహా. యజ్ఞము వలన మనసు లభించును గాత. స్వాహా. యజ్ఞము వలన జ్యోతి లభించును గాత. స్వాహా. యజ్ఞము వలన పృష్టము లభించును గాత. స్వాహా.

34. ఒకటికి స్వాహా. రెండటికి స్వాహా. నూటికి స్వాహా. నూటొక్కటికి స్వాహా. దివారాత్రములకు స్వాహా. స్వర్గమునకు స్వాహా.

దాశరథి రంగాచార్య విరచిత

శ్రీమదాంధ్ర వచన శుక్ల యజుర్వేద సంహితయందలి

అశ్వమేధాహుతియను ఇరువది రెండవ అధ్యాయం సమాప్తము.

సర్వేభస్తు సుఖినః

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతం |

ఆధారస్సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ||

## ఇరువది మూడవ అధ్యాయము

1. హిరణ్యగర్భః సమవర్త్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్ |
సదాధార పృథివీం ద్యాముతేమాం కస్మైదేవాయ హవిషా విధేమ||

సృష్టికి ఆదికాలమున ఒక్క హిరణ్యగర్భుడు మాత్రము ఉండెను. అతడే సకల భూతజాతములకు అధిపతి యైనాడు. అతడే ఈ ద్యావాపృథ్వులను భరించినాడు. అట్టి ప్రజాపతికి హవిస్సులు సమర్పింతుము.

2. (మహిమ గ్రహమును అందుకొనవలెను)

గ్రహమా! నీవు ఉపయామ పాత్రద్వారా గ్రహించబడినావు. ప్రజాపతికి ప్రియమవగు నిన్ను అందుకొనుచున్నాను.

(గ్రహమును వేదిపై ఉంచవలెను) ఇది నీ స్థానము.

నీ మహిమ దినములందు. సంవత్సరములందు. వాయువునందు. అంతరిక్షమునందు. ద్యులోకమందు. సూర్యునియందున్నది. అట్టి నీ మహిమకు, ప్రజాపతికి, అన్యదేవతలకు స్వాహా.

3. ఏ ప్రజాపతి తన మహిమ వలన సమస్త జగత్తునకు స్వామి అయినాడో - ఎవడు సమస్త ద్విపాద చతుష్పాద సంపదకు స్వామియో అట్టి ప్రజాపతికి హవిస్సులు అర్పింతుము.

4. గ్రహమా! నీవు ఉపయామ పాత్రద్వారా గ్రహించబడినావు. నీవు ప్రజాపతికి ప్రియమవు. అట్టి నిను అందుకొనుచున్నాను. (గ్రహమున వేదిపై ఉంచవలెను_ ఇది నీ స్థానము.

గ్రహమా! చంద్రుడు నీ మహిమయే. నీ మహిమ రాత్రులందును - సంవత్సరములందును నక్షత్రచంద్రులందును - ఉత్పన్నమైనది. అట్టి నీ మహిమకు - ప్రజాపతికి - అన్యదేవతలకు స్వాహా.

5. సూర్యుడు ఈ మహాజగత్తుమీద రోషరహితుడై భ్రమించుచున్నాడు. ఋత్విజులు సూర్యుని నుతించుచున్నారు. స్వకార్యరతుని చేయుచున్నారు. ఆ సూర్యుని వలననే ద్యులోకము గ్రహనక్షత్రాదులు వెలుగొందుచున్నవి.

6. సూర్యుని అశ్వములు కమనీయ రథమున పూన్చబడునవి. శోణవర్ణలు. శత్రుదమనలు. సూర్యుని వహించుసమర్థలు. అట్టి వానిని ఋత్విజులు తమ స్తుతులచే రాతుమున పూన్చెదరు.

7. (అధ్వర్యు యజమాని రథమున కూర్చుందురు. రథమ యజ్ఞభూమిదాటి నీటిలో నిలుచును. యజమాని అధ్వర్యుతో ఇట్లనును)

అధ్వర్యులారా! ఈ అశ్వములు ఇంద్రుని దేహము. ఇవి ఎంతో దూరము నీటి వరకు వచ్చినవి. వీనిని మరల అదే మార్గమున మరలించండి.

8. (రథము తిరిగి వచ్చును. గుర్రమును విప్పుదురు. అప్పుడు యాజమాన పత్ని అశ్వపు తల, మధ్యభాగము, పృష్ట భాగమునకు ఆజ్యము అంటించును)

అశ్వమా! వసుగణములు గాయత్రీఛందమున నీ తలకు నేయి అటుందురు గాత.

అశ్వమా! రుద్రగణములు త్రిష్టుప్ చంధమున నీ మధ్యభాగామునకు నేయి అంటుదురు గాత.

అశ్వమా! ఆదిత్యగణములు జగతీ ఛందమున నీ వెనుక భాగమునకు నేయి అంటుదురు గాథ.

అశ్వమా! భూర్భువస్వః పేలాలు, పిండి, యవలు, దధి మున్నగునవి తినుము.

ప్రజపతీ! దేవతలారా! భుక్తశేషమును ఆరగించండి.

9. (బ్రహ్మహోతల మధ్య సంభాషణ)

బ్రహ్మఅడుగుచున్నాడు:-

హోతా! వంటరిగా పరిభ్రమించువాడెవడు? మరల పుట్టునట్టి వాడెవడు? చలికి మందు ఏది? మహా ఆవపనమేది?

10. హోత చెప్పుచున్నాడు:-

బ్రహ్మా! వంటరిగా ఆకాశమున భ్రమించువాడు సూర్యుడు. మరల పుట్టునట్టి వాడు చంద్రుడు. చలికి మందు నిప్పు అగును. మహా ఆవపనము చేయునది భూమి.

11. బ్రహ్మ అడుగుచున్నాడు:-

హోతా! పూర్వచిత్తి ఏది? బృహత్ పక్షి ఏది? పిలిప్పిలా ఏమి? పిశంగిల ఏమి?

12. హోత చెప్పుచున్నాడు:-

బ్రహ్మా! ద్యులోకము, వర్షము, పూర్వచిత్తి యగును. అశ్వము బృహత్ పక్షియగును పృథివి పిలిప్పిల యగును. రాత్రి పిశంగిల యగును.

13. అశ్వమా! వాయువు నిన్ను పచనము నుండి రక్షించును గాత. ధూమగ్రీవాగ్ని నిన్ను మేకల నుండి రక్షించును గాత. మర్రి సోమపాత్రలతోను, బూరుగు వృక్షవృద్ధితోను, నిన్ను రక్షింతురు గాథ. రథమును లాగునది నాలుగు కాళ్లతో సాగును. చంద్రుడు మమ్ము రక్షించును గాథ నమ్కోగ్నయే - అగ్నికి నమస్సు.

14. రథము కళ్లెమున శోభిల్లును. కళ్లెము గుర్రమును శోభిల్లును. జలములందు పుట్టిన అశ్వము జలములందు శోభిల్లును. బ్రహ్మ సోమమున శోభిల్లి పురోగమించును.

15. అశ్వమేధాశ్వమా! నీవు స్వచ్ఛంముగా శరీరములను ఏర్పరచుకొనుము. స్వచ్ఛందముగా దేవతలను యజింపుము. అభీష్ట పదార్థములను సేవించుము. నీ మహిమ ఇతరులలో కనిపించదు.

16. అశ్వమా! మేము నిన్ను వధించుట నీకు మరణము కాదు - నష్టముకాదు. ఇక నీవు దేవయాన మార్గమున దేవతలను చేరుకుందువు. అచట పుణ్యవంతులు ఉందురు. వారు చేరిన చోట సవితా దేవత నిన్ను చేర్చుకొనును.

17. పూర్వము అగ్నియే పశువైయుండెను. దేవతలు అగ్ని పశువుతోనే యజ్ఞము చేసినారు. అగ్ని భూలోకమును జయించినాడు. అగ్నియే భూమికి అధిపతియైనాడు.

అశ్వమా! యజ్ఞమున వధించబడిన నీదే ఈ పృథ్వి అగును. నీవే ఈ పృథ్విని జయించగలవు. పోక్షణీ జలమును త్రాగుము. (ప్రోక్షణీ జలమును గుర్రపు నోటికి అందించవలెను)

వాయువు పశువై ఉండెను. దేవతలు వాయు పశువుతోనే యజ్ఞము చేసినారు. వాయువు అంతరిక్షమును జయించినాడు. అగ్నియే భూమికి అధిపతియైనాడు.

అశ్వమా! యజ్ఞమున వధించబడిన నీదే ఈ పృథ్వి అగును. నీవే ఈ పృథ్విని జయించగలవు. పోక్షణీ జలమును త్రాగుము. (ప్రోక్షణీ జలమును గుర్రపు నోటికి అందించవలెను)

వాయువు పశువై ఉండెను. దేవతలు వాయు పశువుతోనే యజ్ఞము చేసినారు. వాయువు అంతరిక్షమును జయించినాడు. వాయువే అంతరిక్షమునకు అధిపతియైనాడు.

అశ్వమా! యజ్ఞమున వధించబడిన నీదే అంతరిక్షమగును. నీవే ఈ అంతరిక్షమును జయించగలవు. ఈ ప్రోక్షణీ జలములను త్రాగుము.

సూర్యుడు పశువై యుండెను. దేవతలు సూర్య పశువుతోనే యజ్ఞము చేసినారు. సూర్యుడు ద్యులోకమును జయించినాడు. సూర్యుడే అంతరిక్షమునకు అధిపతి అయినాడు.

అశ్వమా! యజ్ఞమున వధించబడిన నీదే ద్యులోకమగును. నీవే ద్యులోకమును జయించగలవు. ప్రోక్షణీజలము త్రాగుము.

18. ప్రాణాయ స్వాహా. అపానాయ స్వాహా. వ్యానాయస్వాహా. (పత్నులు పరస్పరము అనుకొనుచున్నారు.) అంబ, అంబిక, అంబాలికలారా! ఏ పురుషుడును మమ్ము త్వరగా అశ్వము వద్దకు చేర్చకున్నాడు. నేను ఆలస్యమైనందున ఈ

దుష్ట అశ్వము కాంపీల దేశపు సుభద్రికయను దానిని పెట్టుకొని పడుకున్నది.

19. (పత్నులు అశ్వమును చేరి తొమ్మిది ప్రదక్షిణలు చేయుదురు)

గణములందు శ్రేష్ఠుడవగు గణపతివగు నిన్ను యాచించుచున్నాము. ప్రియులందు ప్రియపతివగు నిన్ను మేము యచించుచున్నాము. సుఖనిధులందు శ్రేష్ఠసుఖముల అధిపతివగు నిన్ను యాచించుచున్నాము.

వసురూప అశ్వమా! నీవే మాపతివి. (అశ్వమహిషి అశ్వము వద్ద పడుకొనును.) గర్భమును కలిగించు ణీ తేజమును గుంజి నా యోనియందుంచుకొనుచున్నాను. నీవు గర్భము కలిగించు నీతేజమును నాయోనియందుంచుము.

20. అశ్వమా! రమ్ము మేము, నీవు మన నాలుగు నాలుగు కాళ్లను చూచుదము.

అధ్వర్యు అనుచున్నాడు: అశ్వమహిషీ! ఇది స్వర్గతుల్యమగు యజ్ఞ భూమి. దుప్పటి కప్పుకొనుము.

(అశ్వశిశ్న ముపస్థే కురుతే, అశ్వశిశ్నమును యోని యందుంచుకొనును.)

నేను రేతము ధరించు దానను. నాలో రేతమును చేర్చుము.

21. యజమాని అశ్వముతో అనుచున్నాడు:-

సేచక అశ్వమా! లేపిన కాళ్లతో ఈ అశ్వమహిషి యోని యందు ణీ లింగమును ఉంచి వెనుకకు ముందుకు కదలించుము. అదియే స్త్రీలను జీవన భోజనములగును. యః స్త్రీణాం జీవభోజనః.

22. (అధ్వర్యు అంగుళ్యా యోని ప్రదర్శన్నాహ అధ్వర్యు కన్య యోనిని వ్రేలుచే చూపి అనుచున్నాడు)

ఈ యోని 'ఆహలగ్' అని శబ్దము చేయుచు గెంతుపక్షియా? భాగమును శిశ్నము కొట్టినపుడు యోని అమ్గామును మింగినట్లనిపించును.

23. (కన్య అధ్వర్యునకు ఇచ్చిన సమాధానము:-)

నీకు ముందు 'ఆహలగ్' అనుచు పాకుచున్న పక్షి ఏది? ఇది నీనోటి వలె ఏదో చెప్పుచున్నట్లున్నది. అధ్వర్యులారా! ఇక మాట్లాడకండి.

24. (బ్రహ్మ మహిషితో అనుచున్నాడు:-)

మహిషీ! నీ తల్లితండ్రులు మంచము మీద ఉందురు. అప్పుడు నీ తండ్రి స్నేహము చేయుదును, అని పిడికిలితో శిశ్నమును పట్టి భగములోనికి త్రోయును.

25. (మహిషి అనుచున్నది:-)

బ్రహ్మా! నీతల్లితండ్రులు  కూడా మంచము మీద రతి క్రీడ......నీ నోరు మరేదో చెప్పనున్నది. అధిక ప్రసంగము మానుము. "మాత్వం వదో బహు"

26. (ఉద్గాత వావాతను గూర్చి)

బరువులు మోసి అలసిన వానిని లేపినట్లు - ఈ వావాతను పైకి లేపుము. అందువలన యోని మధ్యభాగము, చలిగాలికి ధాన్యము తూర్పారబట్టు రైతువలె వికసించును.

27. (వావాత ఉద్గాతను గూర్చి)

బరువులు మోసి అలసిన వానిని లేపినిలిపినట్లు, ఈ ఉద్గాతను లేపి నిలబెట్టండి. ఇతని మధ్య లింగాభాగము చలిగాలికి ధాన్యము తూర్పారాబట్టురైతు చేతివలె వడకుచున్నది.

("వావాతాదేహ మధ్యం ఇతిమహీధరః" వావాతమన దేహమధ్యమని మహీధరవ్యాఖ్య)

28. (హోత 'పరివృక్త'ను గూర్చి)

చిన్నయోని గలదాని భగమున చిన్న లింగము దూరినపుడు అండకోశము దానియోనిపై నీటిలోనిగోవు పాదము వద్ద చేపలవలె కదలాడుచుండును.

29. (పరివృక్త హోతను గూర్చి)

దేవతలు శ్లేష్మము స్రవించు లింగమును బలముగా యోని యందు ప్రవేశపెట్టినపుడు స్త్రీసర్వాంగములందు- ఇదికన్ను చూచిన సత్యము వంటిది- ఉరునారి యనిపించుకొనును.

30.(క్షత్తాపాలాగలీమాహ)

రైతు పొలమున జింకదూరి పొలము మేయునప్పుడు రైతు, పశువు పంటతిని బలిసినది అనుకొనడు. పంటపోయినందుకు దుఃఖించును. అట్లే శూద్ర వనిత ధనికుని ఉంపుడు కత్తె అయినపుడు, దాని భర్త ధనము వచ్చునని సంతసించడు. తన భార్య వ్యభిచారిణి అయినందుకు దుఃఖించును.

31. (పొలాగలీ ప్రత్యాహ)

హరిణము పొలము మేసినపుడు పశువు బలిసినదని రైతు సంతసించడు. అట్లే శూద్రుడు ధనిక స్త్రీకి జారుడైనపుడు ధనికుడు సంతసించడు. దుఃఖించును.

32. (అశ్వము వద్ద పడుకొనియున్న మహిషిని లేపవలెను)

ఈ అశ్వము గమనకారి. జయశీలము. వేగవంతము. దీని పవిత్రతకాని మేము అశ్లీల భాషణచేసినాము. ఇప్పుడు మనోళ్లు పవిత్రములగును గాత. మా ఆయువు వృద్ధి చెందును గాత.

33. (ముగ్గురు భార్యలు రాగి, వెండి, బంగారు సూదులచే గుర్రపు చర్మమును ఛేదింతురు)

అశ్వమా! గాయత్రి, త్రిష్టుప్, జగతి, అనుష్టుప్, పంక్తి, బృహతి, ఉష్ణిక్, కకుప్ ఛందములు ఈ సూదులచే అశ్వమును సంస్కరించును గాత.

34. ద్విపద, త్రిపద, చతుష్పద, షట్పద ఛందములును ఛందోభావ, ఛందములును ఛందోభావ, ఛందలక్షణ ఛందములును ఈ సూదులచే అశ్వమును సంస్కరించును గాత.

35. మహానామ్ని శక్వరి ఋచలు, రైవత్సామపు రేవతీఋచ, సమర్థములగు అన్నిదిశలు, మేఘపు వైద్యుతవాణి అశ్వమును ఈసూదులచే సంస్కరించును గాత.

36. అశ్వమా! రాజపత్నులు, అన్యశుభలక్షణ మహిళలు నీ రోమములు పీకుదురు గాత. దేవపత్నులు, దిశలు నిన్ను సూదులచే సంస్కరింతురు గాత.

37. వెండి, బంగారము, రాగి సూదులకట్టలు అశ్వము యొక్క శరీరమును ఛేదించును అశ్వశరీరముతో సంగతులు అగుదురు గాత. వేగవంతమగు అశ్వపు చర్మము ఛేదించుచు సూదులు సంస్కరించును గాత.

38. రైతులు ధాన్యమును గడ్డి నుండి వేరుచేసి కోయుదురు. అట్లే దర్భాసనముల మీద ఆసీనులై స్తుతులచే

దేవతలను యజించు వారి కొరకు ఈ లోకమున భోజనాదులు ఏర్పాటు చేయండి.

39. అశ్వమా! ఎవడు నిన్ను నరుకును? ఎవడు నీ తోలు వలుచును? ఎవడు నీ అవయవములను కోయును? విద్వాంసుడే వీనినన్నింటిని చేయును. మరొకడు కాదు.

40. అశ్వమా! సంవత్సరపు తేజమున ఋతువులను అనుసరించి ఋతువులే ఆస్థి గంధులను కోయును గాత. అవి తమ కర్మములచే నీకు హవిభావము ప్రాప్తింప చేయుదురు గాత.

41. అశ్వమా! మాసములు, అర్ధమాసములు సంస్కరించుచు నీ గ్రంథులను కోయుదురు గాత. దివారాత్రులు మరుత్తులు నీ లఘు అంగములను విడదీయుదురు గాత.

42. దైవీ అధ్వర్యులగు అశ్వినులు నిన్ను కోయవలెను. హవి రూపమున ప్రదానము చేయవలెను. దేవతలు నీ దేహమున సీమా రేఖలు ఏర్పరచవలెను.

43. అశ్వమా! ద్యులోక, భూలోక, అంతరిక్షములు, వాయువు నీ యొక్క ఛిద్రములను పూడ్చవలెను. నక్షత్ర సహిత సూర్యుడు నీకు స్వర్గము ప్రసాదించును గాత.

44. అశ్వమా! నీ శరీరమునందలి శిరము మున్నగు ఉత్తమాంగములు శాంతించును గాత. ఇతర చిన్న అవయవములు శాంతించును గాత. ఎముకలు మూలుగు శాంతించును గాత. సమస్త శరీరము శాంతించును గాత.

45. వంటరిగా భ్రమించువాడెవడు? ఎవడు మరల జన్మించును? మంచుకు మందేది? మహదావ పనమెవరిది?

46. సూర్యః ఏకాకీ చరతి | చన్ద్రమా జాయతే పునః| అగ్నిర్హి మస్య భేషజం| భూమిరావపనం మహత్||

47. సూర్య సమ జ్యోతి ఏది? సముద్ర సమమైన సరస్సు ఏది? పృథ్విని మించినదెవరు? పరిమాణము లేనిదేమి?

48. బ్రహ్మ సూర్య సమజ్యోతి యగును. ద్యులోకము సముద్ర సమాన సరోవరమగును. ఇంద్రుడు పృథ్విని మించిన చిరంజీవి. పరిమాణము లేనిది గోవు.

(గవాహి యజ్ఞోధార్యతే. గోవు యజ్ఞమును ధరించునది అయినందున దీనికి పరిమాణము లేదు)

49. దేవమిత్ర ఉద్గాతా! నా జ్ఞానమునకు నిన్ను అడుగుచున్నాను. విష్ణువు మూడు పదములందు అశ్వవనీయ, గార్హపత్య, దక్షిణాగ్నులందు యజనము చేయగా సమస్త జగము వానిలోనే చేరినవి. ఈ విషయము నీవు ఎన్నడైన

ఆలోచించినావా?

50. (ఉద్గాతా ప్రత్యాహ - ఉద్గాతబదులు చెప్పినాడు)

ఈ లోకములన్నియు చేరిన మూడు స్థానములందు నేను సహితము ఉందును. తక్షణమే భూలోకము తిరిగి వత్తును. ద్యులోకము తిరిగి వత్తును. ఒకే అంగము - మనసున - నేను స్వర్గపు ఉత్తమ స్థానమును ఎరుంగగలను.

51. బ్రహ్మ! నేను స్పర్ధచే నిన్ను ఈ ప్రశ్న అడుగుచున్నాను. ఈ విషయమున నాకు ఎట్టి సమాధానము ఇవ్వగలవు?

పురుషుడు వేని యందు ప్రవేశించి ఉన్నాడు? పురుషుని యందు ఏవి ప్రవేశించి ఉన్నవి?

52. (బ్రహ్మ ప్రత్యాహ)

పంచభూతములందు పురుషుడు ప్రవేశించి ఉన్నాడు. పురుషిని యందు పంచభూతములు ప్రవేశించి ఉన్నవి. నిన్ను నాకు ప్రతిద్వంద్వగా భావించి వివరించినాను. బుద్ధియందు నీవు నన్ను మించిన వాడవుకావు.

53. పూర్వచిత్త ఏమి? పెద్దదియు భారమగు పక్షి ఏది? పిలిప్పిల ఏది? పిశంగిల ఏది?

54. వర్షము పూర్వచిత్తి అయినది. అశ్వము పెద్దదియు భారమగు పక్షి అయినది. పృథ్వి పిలిప్పిల అగును. రాత్రి పిషంగిల అగును.

55. (అధ్వర్యుర్హో తారం పృచ్ఛతి)

పిశింగిల ఎవరు? కురుపిశంగిల ఏది? దుముకుచు నడుచునది ఏది? పాకుచు సాగునది ఏది?

56. (ప్రత్యాహ)

అధ్వర్యూ! రాత్రి పిశంగిల యగును. శ్వావిత్ కురుపిశింగిల యగును. దుమికి నడుచునది కుందేలు. పాకి సాగునది సర్పము.

(పిశం రూపం గిలితి భక్షయతి పిశంగిల. తన రూపమును తాను తినునది పిశంగిల. శ్వావిత్ ఏదుపంది వంద మూలములను తినునది అని అర్థము.)

57. (బ్రహ్మా ఉద్గాతను అడుగుచున్నాడు)

ఉద్గాతా! ఈ యజ్ఞమున అన్నములెన్ని? దీనికి అక్షరములెన్ని? హూమము లెన్ని? సమిధలెన్ని? ఎందరు హోతలు ఋతువులనసరించి యజింతురు?

నీవు యజ్ఞజ్ఞాతవని అడుగుచున్నాను.

58. (ప్రత్యాహ)

బ్రాహ్మన్! ఈ యజ్ఞమున ఆరు అన్నములున్నవి. వంద అక్షరములు. ఎనుబది హోమములు, మూడు సమిధలు కలవు. ఏడుగురు హోతలు ఋతువులననుసరించి యజింతురు. యజ్ఞము నెరిగిన నేను నీకు ఈ విషయములు చెప్పుచున్నాను.

(ఆరురుచులు, ఆరుఅన్నములు, ఛందమునందలి అక్షరములు వంద. ఉష్టిక్ 28+ ధృతిః 72=100. యూపమునకు 20 చొప్పున నాలుగు యూపములు 20 X 4 = 80.1. మృగములు 2. ప్రజాపతులు 3. పశువులు, సమిధలు)

59. (ఉద్గాతా బ్రహ్మాణం పృచ్ఛతి)

బ్రహ్మా! ఎవనికి ఈ భువనపు నాభి తెలియును? ద్యావాప్పృథ్వి అంతరిక్షములను ఎవడు తెలియును? సూర్యుని ఉత్పత్తి స్థానము తెలిసినవాడెవడు? చంద్రుడు పుట్టిన స్థలము తెలిసినవాడెవ్వడు?

60. (ప్రత్యాహ)

వేదాహమస్య భువనస్య నాభిం. నేను భువనపు నాభిని ఎరుంగుదును. ద్యావాప్పృథ్వి అంతరిక్షములను ఎరుంగుదు. సూర్యుని మహా ఉత్పత్తి స్థానమును ఎరంగుదును. చంద్రుడు పుట్టిన స్థలమును ఎరుంగుదును.

61. (అధ్వర్యుం యజమానః పృచ్ఛతి)

అధ్వర్యులారా! మిమ్ము నేను పృథ్వియొక్క పరమ అంతము అడుగుచున్నాను. భువనముల నాభిని అడుగుచున్నాను. సేచక అశ్వపు వీర్యము అడుగుచున్నాను. వాణి యొక్క పరమ వ్యోమమును గురించి అడుగుచున్నాను.

62. (ప్రత్యాహ)

యజమానీ! ఈ వేదియే పృథ్వికి పరమ అంతము. ఈ యజ్ఞమే భువనమునకు నాభి. ఈ సోమమే సేచక అశ్వపు వీర్యము. ఈ బ్రహ్మయే వాణి యొక్క పరమ వ్యోమము.

63. విశ్వమును సృష్టించినవాడు - స్వయముగనే బ్రహ్మాండ శరీరమును దాల్చినవాడగు అనాదినిధన పరమ పురుషుడే సృష్టి మహార్ణవమున కాలప్రాప్త గర్భమును ధరించినాడు. ఆ గర్భము నుండియే ప్రజాపతి ఆవిర్భవించినాడు. యతో జాతః ప్రజాపతిః

64. దైవీ హోత సోమ మహిమవ ప్రజాపతిని యజించినాడు. యజించబడు ప్రజాపతి మహిమాన్విత సోమమును పానము చేయును గాత. మానవహోతా! యజింపుము.

65. ప్రజాపతీ! ఈ భూతజాతము నీకన్న వేరు కాదు. సకల చరాచర ప్రాణులున్నవి. వాణి అన్నింటిపైన నీవే ప్రజపతివి.

ప్రజాపతీ! మేము ఏ కోరికలతో నీ హోమము చేయుచున్నామో అవి మాకు లభించును గాత. మేము ధనపతులమగుదుము గాత.

ఆలోచనామృతము

1. యజ్ఞము ఒక్కడు చేయగలది కాదు. అందుకు అనేకుల సహకార సద్భావములు అవసరము. కలిసి పనిచేసినచో యజ్ఞమగును. ఇందరు ఒకచోట కూడుటయే మహాయజ్ఞము. యజ్ఞఫలము ఇంత మాత్రము చాలదా?

ఈ జీవితము ఒక మహా యజ్ఞము. ఎందరి సహకారమున మన జీవనము సాగుచున్నది. పంట పండుటకు అది మన వద్దకు వచ్చుట మహా యజ్ఞమగును. అందుకే అన్నము పరబ్రహ్మ స్వరూపమగును. దానిని పూజించవలెను. వృథా చేయరాదు.

2. వేదమునకు సకల ప్రాణుల సమములు. పూజ్యములు. ముఖ్యములు. మనకు పనికి వచ్చు చెట్టు, పుట్ట, గుట్ట మున్నగువానిని పూజించుట - ఎంతటి పడమటి గాలి తగిలినను మన ఆచారము సంప్రదాయము, జీవన విధానము.

ఇది మహోన్నతము, ఇందుకు సాటి వచ్చునది ఈనాటికి లేదు. నేడు ఈ విషనాగరికతను దాటుటకు ఇంతకు మించిన దారి లేదు.

ఈ దారి వేనవేల యేండ్లక్రింద వేదములు పరచినది!

3. మానవుల వలెనే అశ్వములకు సహితము కుటుంబము ఉన్నట్లు భావించబడినది.

భార్యలు ఆలస్యముగా వచ్చినారు. అతడు ఆ అశ్వము మరొక సుభద్రతో కులుకుచున్నాడు - 18

భర్త చావమన్నాడు, అతని రూపమున భార్యకు సంతానము కావలెను. ఆమె కామమున ఎగబడినది! - 19.

మనష్యుల కాపురము వంటివే జంతువుల కాపురములు|

4. అశ్వము వద్ద రాణి శయనించినదని ఒక అపోహ ఏర్పడిఉన్నది. 'మహిషే అశ్వము పసంవిశతి' అనగా అశ్వ మహిషి అగును. రాజ మహిషి కాదు. తరువాతి మంత్రములందు అశ్వ భార్యలే కనిపింతురు. 32 మంత్రమున 'మహిషే ముత్థాప్య' మహిషిని లేవదీసి అని అర్థము.

ఇది స్వార్థ పరులు కల్పించిన అపార్థము.

5. మైధునము సకల ప్రాణి సహజము. ఆహార నిద్రా భయ మైధునాని ఎతైహిరేకం పశుభిః నారాణాం. ఇందును గురించి వివరించుటలో దోషము లేదు. నేడు లైంగిక విద్య అవసరమనుచున్నారు గదా! అది ఆనాడే గుర్తించినారు కదా!

6. యజ్ఞమున యాగము, హోమము మాత్రమే కాదు. చెట్టు నీడనో, పందిరి కిందనో కూర్చుని జరుపు తాత్విక చర్చ కూడా అగును. ఇచట - భౌతిక విషయములకు అతీతముగా తాత్విక గంభీర విషయముల చర్చ జరిగినది.

దాశరథి రంగాచార్య విరచిత

శ్రీమదాంధ్ర వచన శుక్ల యజుర్వేద సంహితయందలి

అశ్వమేధాహుతి యను ఇరువది మూడవ అధ్యాయము సమాప్తము.

సర్వేభస్తు సుఖినః

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతం |

ఆధారస్సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ||

## ఇరువది నాలుగవ అధ్యాయము

1. అశ్వస్తూపరో గోమృగస్తే ప్రాజాపత్యాః కృష్ణగ్రీవ ఆగ్నేయా రరాటే పురస్తాత్సారస్వతీ మేష్య దస్తాద్ధాన్వో

రాశ్వినా వధో రామౌ బహ్వాఃసౌమా పౌష్ణః శ్యామో నాభ్యాం సౌర్య యామోశ్వేతశ్చ కృష్ణశ్చ పార్శ్వ యో స్త్వాష్ట్రా లోమసక్ధౌ సక్థ్యోర్వాయవ్యః శ్వేతః పుచ్ఛఇన్ద్రాయ స్వపస్యాయ వేహ ద్వైష్ణవో వామనః||

(అశ్వమేధమున ఇరువది యొక్క యూపములుండును. మధ్య యూపమును 'అగిష్ఠము' అందురు. దానికి పదిహేడు పశువులు కట్టబడును.)

అశ్వము, కొమ్ములు లేని మేక, గోవు ఇవి ప్రజాపతికి సంబంధించిన పశువులు. వానిని మధ్యయూపమునకు కట్టుచున్నాను. నలుపుగొంతు మేక అగ్ని సంబంధము. దానిని అశ్వపు ముఖము వద్ద కట్టుచున్నాను. మేక సరస్వతి సంబంధి దానిని ముందు కట్టుచున్నాను. తెలుపు, నలుపు, తెలుపు పశువులను గుర్రపు కుడి ఎడమ ప్రక్కల కట్టుచున్నాను. త్వష్ట యొక్క రెండు పశువులను గుర్రపు వెనుక కాళ్ళకు ఒక్కొక్కటి చొప్పున కట్టుచున్నాను. వాయుసంబంధి పశువును గుర్రపు తోకకు కట్టుచున్నాను. సుకర్మ ఇంద్రుని కొరకు కడుపుతోనున్న ఆవును - విష్ణువునకు పొట్టి పశువును గుర్రపు తోకకు కట్టుచున్నాను.

(ఇవి పదిహేను పశువులు. వీనిని 'పర్యంగ్య' అందురు. మిగత యూపములందు పదహారేసి పశువులు కట్టుదురు.)

2. లోహితము, ధూమ్ర లోహితము, రేగుపండు ఎరుపు ఇవి సోమదేవతా సంబంధములు. పసుపు పచ్చనిది, చిలక పచ్చనిది, అరుణ బభ్రు వరుణ దేవతాకములు. కృష్ణ ఛిద్రము - శితి ఛిద్రము, సర్వశితి ఛిద్రము, సవితా దేవతాకములు. నల్ల కాళ్ళది, శితి బాహువు, సర్వ శితి బాహువు బృహస్పతి దేవతాకము.

(వీనిని మధ్య యూపమున కట్టవలెను.)

విచిత్ర వర్ణ బిందు, లఘు బిందు, స్థూల బిందు గోవులు మిత్రా వరుణ దేవతాకములు.

(వీనిని రెండవ యూపమున కట్టవలెను.)

3. శుద్ధ వాలము, సర్వ శుద్ధ వాలము, మణి శుద్ధ వాల పశువుల అశ్వినీ దేవతాకములు శ్వేత, శ్వేత చక్షు అరుణ వర్ణ పశువులు పశుపతి రుద్ర దేవతాకములు. తెలుపు చెవులవి యమ సంబంధులు. గర్వయుక్త పశువులు రుద్ర సంబంధములు. నభోరూపలు పర్జన్య సంబంధులు.

(పశవః తృతీయ నియోజ్యాః)

4. విచిత్ర వర్ణలు, వంకర గీతలవి. ఎదురు గీతలు పశువులు మరుద్దేవతాకములు. చిక్కిన దేహములవి, రక్త రోమములవి, తెల్లని ఆడ పశువులు సరస్వతీ దేవతాకములు. ప్లీహ కర్ణలు, హ్రస్వ కర్ణలు, రక్త కర్ణ పశువులు త్వష్ట

దేవతాకములు. నల్లని మెడ గల తెల్లని చంక గల, పుండ్ర జంఘ పశువులు, ఇంద్రాగ్ని దేవతాకములు. కృష్ణపుండ్ర, అల్పాపుండ్ర, అల్పాంజి, మహాంజి పశువులు ఉషా దేవతాకములు.

(చతుర్థే యూపే నియోజ్యాః)

5. విచిత్ర వర్ణలగు మూడు స్త్రీ పశువులు విశ్వే దేవతలవి. రెండున్నర ఏండ్ల ఎర్రని పశువులు వాగ్దేవతవి. విశేష చిహ్నములు లేని మూడు పశువులు అదితి దేవివి. సమాన వర్ణలగు మూడు పశువులు దాతా దేవతని. చిన్న మేకలు దేవ పత్నులవి.

(పంచమే)

6. నలుపు మెడ గల మూడు పశువులు అగ్ని దేవతవి. శ్వభ్రు వర్ణలు మూడు వసువులవి. ఎరుపు రంగు మూడు పశువులు రుద్రులవి. శ్వేత వర్ణ, అధోచ్ఛిద్రములు మూడు ఆదిత్యులవి. నభో రూపములు మూడు పర్జన్యునివి.

(షష్ఠే)

7. ఎత్తువియు, పొట్టివగు మూడు పశువులు ఇంద్ర, విష్ణువులవి. పూర్ణ శ్వేత బాహు, శ్వేత పుష్టములు ఇంద్ర - బృహస్పతులవి. చిలక పచ్చనివి మూడు అశ్వ దేవతవి. మట్టి రంగువి మూడు అగ్ని, మరుత్తులవి. నలుపు వర్ణపు మూడు పూష దేవతవి.

(సప్తమే)

8. కుర్వర వర్ణములగు మూడు పశువులు ఇంద్రాగ్నులవి. రెండు రంగుల మూడు అగ్ని - సోములవి. పొట్టి ఎద్దులు మూడు అగ్ని - విష్ణువులవి. వంధ్య మేషములు మూడు మిత్రా వరుణులవి. మట్టి రంగుని మూడు - వేరుగా- మిత్ర దేవతవి.

(అష్టమే)

9. నలుపు మెడల మూడు పశువులు అగ్ని సంబంధులు. పసుపు పచ్చని మూడు సోమ సంబంధులు. తెలుపు రంగువి మూడు వాయు సంబంధులు. చిహ్న రహితలు మూడు అదితి సంబంధులు. సమాన వర్ణలు మూడు ధాత సంబంధులు. మూడు చిన్న మేకలు దేవపత్ని సంబంధలు.

(తొమ్మిదవ యూపమున కట్టవలెను.)

10. మూడు నల్లని పశువులు భూమి దేవతాకములు. మూడు ధూమ్ర వర్ణలు అంతరిక్ష దేవతాకములు. మూడు పెద్ద పశువులు ద్యుదేవతాకములు. మూడు వివిధ వర్ణలు విద్యుద్దేవ తాకములు. మూడు సిధ్మరోగ పశువులు నక్షత్ర దేవతాకములు.

(పదవ యూపమునకు కట్టవలెను.)

11. ధూమ్ర మేషములు మూడింటిని వసంతమునకు బలిఇత్తుము. తెలుపు మేకలు మూడింటిణి గ్రీష్మ ఋతువునకు బలి ఇత్తుము. నలుపు మేకలు మూడింటిణి వర్ష ఋతువునకు బలి ఇత్తుము. ఎరుపు మేకలు మూడింటిని శరదృతువునకు బలి ఇత్తుము. మచ్చల మూడు మేకలను హేమంతమునకు బలి ఇత్తుము. పసుపు రంగు మూడు మేకలను శిశిరమునకు బలి సమర్పింతుము.

12. ఒకటిన్నర సంవత్సరముల మూడింటిని గాయత్రికి, రెండున్నర సంవత్సరముల మూడింటిని త్రిష్టుప్ నకు, రెండేళ్ళ మూడింటిని జగతికి, మూడేళ్ళ మూడింటిని అనుష్టుప్ నకు, మూడున్నర ఏండ్ల మూడింటిని ఉష్ణిక్ ఛందముల కొరకు బలి సమర్పింతుము.

13. నాలుగేండ్ల మూడింటిని విరాట్ ఛందమునకు, మూడేండ్ల మూడు ఎద్దులను బృహతీ ఛందమునకు, మూడు వృషభములను కకుప్ ఛందమునకు, మూడు ఎద్దులను పంక్తి ఛందమునకు, మూడు గోవులను అతిచ్ఛందమునకు బలి అర్పింతుము.

14. మూడు నల్లని మెడ పశువులు అగ్ని దేవతాకములు. మూడు బభ్రు వర్ణలు సోమ దేవతాకములు. మూడు ధ్వస్త వర్ణలు సవిత్ృ దేవతాకములు. మూడు వత్సతరములు సరస్వతీ దేవతాకములు. మూడు కృష్ణ వర్ణలు పూష దేవతాకములు. మూడు పృశ్ని వర్ణలు మరుద్దేవతాకములు. మూడు అనేక రూపాలు విశ్వే దేవతాకములు. మూడు గొడ్డు ఆవులు ద్యావాపృథ్వీ దేవతాకములు.

15. వరుణ ప్రఘాస పర్వపు పదిహేను పశువులు చెప్పబడినవి. మూడు కర్వర పశువులు ఇంద్రాగ్ని దేవతాకములు. మూడు కృష్ణ వర్ణ పశువులు వరుణ దేవతాకములు. మూడు చారల పశువులు మరుద్దేవతాకములు. మూడు కొమ్ములు లేని పశువులు ప్రజాపతి దేవతాకములు.

16. (అథ సాకమేధ పశవః)

తొలి చూపు మూడు పశువులను సేనావాన్ అగ్ని కొరకు వధించవలెను. వాత్య పశువులను మూడింటిని సాంతపాన మరుత్తుల కొరకు, మూడు అప్పుడే పుట్టిన పశువులను గృహమేధి మరుత్తుల కొరకు, మూడు సంకల్పిత

పశువులను క్రీడి మరుత్తుల కొరకు, మూడు విడి పశువులను స్తవవాన్ మరుత్తుల కొరకు వధించవలెను.

17. పద్దెనిమిదవ యూపపు హవియను పదిహేను పశువులు చెప్పబడినవి. పందొమ్మిదవ యూపమునకు మూడు కుర్వర వర్ణలు ఇంద్రాగ్నుల కొరకును, మూడు పెద్ద కొమ్ములవి మహేంద్ర దేవత కొరకును, అనేక వర్ణ పశువులు విశ్వ కర్మ కొరకును కట్టవలెను.

18. (పితరుల ఇష్టదేవతా పశువులు)

మూడు కృష్ణవర్ణ ధూమ్రములు సోమపాయి పితరులవి. మూడు పసుపు ధూమ్రములు దర్భాసన పితరులవి.

(ఇరువదవయూపమున)

కృష్ణ బభ్రువర్ణలు అగ్ని ష్వాత్త పితరులవి. మూడు నల్లని పృష్టము - చుక్కలు గలవి త్ర్యంబాకా దేవతాకములు.

19. (శునాసీరీయ పశవః)

అగ్ని మున్నగు వారికి సంబంధించిన పదిహేను పశువులు చెప్పబడినవి. మూడు కుర్వరపశువులు శునాసరీయములు.

(ఇరువది ఒకటవ యూపమున)

మూడు తెల్లని పశువులు వాయు దేవతాకములు. మూడు తెల్లనిచే సూర్యదేవతాకములు.

(ఏవం సమప్తాః యూపాః)

20. (అథారణ్యాః పశవః ఉచ్యన్తే)

వసంతము కపింజలమును, గ్రీష్మమునకు కలర్వికమును, వర్షమునకు తిత్తిరులను, శరత్తుకు వర్తికమును, హేమంతమునకు కకరమును, శిశిరమునకు వికికిరములను బలి ఇవ్వవలెను.

21. సముద్రమునకు శింశుమారమును, పర్జన్యునకు మండూకమును, జలములకు మత్స్యములను, మిత్రునకు కులీపయ మత్స్యములను, నాక్రాస్తజలచరములను వరుణునకు బలి ఇవ్వవలెను.

22. సోమమునకు హంసలను, వాయువునకు కొంగలను, ఇంద్రాగ్నులకు సారసములను, మిత్రునకు మద్గులను, వరుణునకు చక్రవాకములను బలి ఇవ్వవలెను.

23. అగ్నికి కుక్కుటములను, వనస్పతులకు ఉలూకమును, అగ్నిసోములకు చాషలను, అశ్వినులకు మయూరములను, మిత్రావరుణులకు కపోతములను బలి ఇవ్వవలెను.

24. సోమునకు లవపక్షులను, త్వష్టకు కులీకులను, గోపాదులను దేవపత్నులకు, దేవజాతులు మరియు గృహస్పతి అగ్నికి పారుష్ణములను బలి ఇవ్వవలెను.

25. దినములకు కపోతమును, రాత్రికి సీచాపును, రాత్రింబవళ్ల సంధులకు జతూపాత్రమును, మాసములకు జాత్యోహమును, సంవత్సరమునకు గరుడమును బలి ఇవ్వవలెను.

26. భూమికి మూషికమును, అంతరిక్షమునకు పాంకమూషికములను, ద్యులోకమునకు కశమూషిములను, దిశలకు నేవలములను, అవాంతర దిశలకు బభ్రుకులను ఆలంబనము చేయవలెను.

27. వసువులకు బుశ్యలను, రుద్రులకు రురువులను, ఆదిత్యులకు న్యకువులను, విశ్వేదేవులకు పృషతులను, సంధ్యలకు కులుంకులను వధించవలెను.

28. ఈశానునకు పరస్వత మృగమును, మిత్రునకు గౌరమును, వరుణునకు మహిషమును బృహస్పతికి గవయులను బలి ఇవ్వవలెను.

29. ప్రజాపతికి మగ ఏనుగును, వాణికి వక్రతుండమును, నేత్రములకు మశకములను, కర్ణములకు భ్రమరములను బలి ఇవ్వవలెను.

30. ప్రజాపతి, వాయువులకు గౌరమృగమును, వరుణునకు అరణ్యమేషమును, యమునకు కృష్ణ మేషమును, మనుష్యరాజాయ మర్కటః సింహమునకు బుష్యమును, బుషభమునకు, గవయిని, క్షిప్రశ్యేనమునకు వర్తికను, నీలింగమునకు కీటమును, సముద్రమునకు శింశుమారమును, హిమాలయమునకు గజమును ఆలంబనము చేయవలెను.

31. ప్రజాపతికి తురంగవదన కిన్నరము, ఉవమృగము, హలక్షణ సింహములగును. వృషదేవతది బిడాలము, ధాతకు కొంగ, దిశలకు కాకి, అగ్నిదేవతకు చటకము, త్వష్టకు రక్తసర్పము. పుష్కర సాదము. వాక్కునకు సారసమగును.

32. కులంగ, అరణ్యఅజ, నేవలా మయూరి సోమదేవతవి. పూషదేవతది కోష్ఠము. మాయుది నక్క. ఇంద్రునిది గౌరమృగము. పిద్వునిది న్యంగుకము. అనుమతి కక్కటము. ప్రతిశ్రుతిది చక్రవాకము.

33. వలాహక, శార్గములు సూర్యదేవతాకములు. సృజయ, శాయండకములు మిత్రదేవతాకములు. పురుషవాక్కుశారిక సరస్వతీ దేవతాకము. శ్వావిత్ భూమి దేవతాకము. వ్యాఘ్ర, వృక, చిరుత, సర్పములు మన్యు దేవతాకములు - శ్వావిత్ భూమి దేవతాకము. వ్యాఘ్ర, వృక, చిరుత, సర్పములు మన్యు దేవతాకములు - చిలక సముద్ర దేవతాకము.

34. గరుడుడు పర్జన్య దేవతాకుడు. అతిర్వాహస, దర్వాదులు వాయుదేవతాకములు. పైంగరాజ పక్షి వాక్పాలక బృహస్పతి దేవతాకము. అలజము అంతరిక్షదేవతాకము. ప్లవ, మత్స్య, మద్గు నదీపతి సాగర దేవతాకము. కూర్మము ద్యావాపృథ్వీ దేవతాకము.

35. పురుష మృగము చంద్రదేవతాకము. దార్వాఘటములు వనస్పతి దేవతాకములు. తామ్రచూడము సవితృదేవతాకము. హంస వాయుదేవతాకము. నాక్ర, మకర, కులీప,మత్స్యములు సాగరదేవతాకములు. "హ్రియైశాల్యకః".

36. మృగి దిన దేవతాకము. మండూక, మూషక, తిత్తురులు సర్పదేవతాకములు. లోపాశ అశ్వినులది. కృష్ణమృగము రాత్రిదేవతది. ఎలుగు, జతు. సుషీలిక అన్య జనులవి. "జహకావైష్ణవీ".

37. కోకిల అర్ధమాసములది. ఋష్యమృగ, మయూర, సుపర్ణలు గంధర్వులవి. ఉద్రము జనులది. తాబేలు మాసములది. రోహిత్పుణ్డుణాచీ గోలత్తికా త్కేప్సరసాం మృత్యువే అసితః మృత్యువుది నల్లని మృగము.

38. భేకి ఋతుసంబంధి. మూషిక, కశ, మంధాలములు పితృసంబంధులు. అజగరము బలసంబంధి. కపింజలము వసుసంబంధి. కపోత, ఉలూక, శశికము నిర్పతి సంబంధులు. "వరుణాయ అరణ్యో మేషః".

39. శ్వేత ఆదిత్యానాం - ఉష్ణో, ఘృణీవాన్, వాఘ్రీనస్, మత్యా - మతికొరకు, సృమరో అరణ్యాయ రురురౌద్రః - క్వయి, కుటరు, దాత్యైహ వాజినాం. కామాయ పికః.

40. ఖడ్గోమృగః వైశ్వదేవః శ్వాకృష్ణః, కర్ణోగర్దభః, అక్షుః రక్షసా. ఇంద్రాయ సూకరః. సింహోమారుతః కృకలాసః, పిప్పకా, శకునిస్తే శరవ్యాయై. విశ్వేషాం దేవానాం పృషతః.

ఆలోచనామృతము

1. ఇది వేదము. ఇందు విశ్వమంతయు ఇముడును. నేటివంటి వర్గీకృత శాస్త్రములు నాడులేవు. నేటి వర్గీకృతముల వలన శాస్త్రజ్ఞులు ఇబ్బంది పడుచున్నారు. కుడి కన్ను తెలిసినవానికి ఎడమకన్ను తెలియకున్నది. నేటి శాస్త్రజ్ఞులు WHOLISTIC సంపూర్ణ శాస్త్రమును గురించి ఆలోచించుచున్నారు. ఇది మనిషికి అక్కరకు వచ్చునది. వర్గీకరణ డబ్బుకు అక్కర వచ్చునది.

2. ఈ అధ్యాయమున పశు, పక్ష్యాదులను గురించి చెప్పబడినది. వీనిలో ఎన్ని నేడున్నవో, ఎన్ని మృగ్యమైనవో పరిశీలించవలసి ఉన్నది. దేవతల సంబంధ విషయము కూడ పరిశోధించవలెను.

నాకు తెలిసినంతలో భూమికి ఎలుకలను, కంటికి దోమలను, చెవులకు తుమ్మెదలను బలి ఇమ్మన్నాడు. ఇవి వాటి వాటికి నష్టము కలిగించునవి. ప్లవో మద్గుర్మత్స్యస్తే నదీపతమే. ప్లవ, మద్గుర, మత్స్యములు సాగరమునకు ఉపకరించునవి. పరిశీలనలో సర్వము విదితమగును.

దాశరథి రంగాచార్య విరచిత

శ్రీమదాంధ్ర వచన శుక్ల యజుర్వేద సంహితయందలి

దేవతా పశువాచకమగు ఇరువది నాలువఅధ్యాయము ముగిసినది.

అధనాస్పధనాస్పంతు.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతం |

ఆధారస్సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ||

## ఇరువది అయిదవ అధ్యాయము

1. శాదం దద్భిరవకాం దన్తమూలైర్మృదం బర్స్వైస్తేగాం దంష్ట్రాభ్యం సరస్వత్యా అగ్రజిహ్వం జిహ్వయా ఉత్సాదమన క్రన్దేవ తాలువాజం హనుభ్యామప ఆస్యేన వృషణమాణ్డాభ్యామాదిత్యాం శ్మశ్రుభిః పన్థానం భ్రూభ్యాంద్యావాపృథివీ వర్తోభ్యాం విద్యుతం కనీనకాభ్యాం శుక్లాయస్వాహా కృష్ణాయస్వాహా పార్యాణి పక్ష్మాణ్యవార్యాఇక్షవోఽవార్యాణి సార్యాఇక్షమః

దంతములచే శాదదేవతను, ఇగుళ్లచే భవక దేవతను, దంతముల వెనుక భాగముచే మదదేవతను, దంష్ట్రములచే తేగదేవతను, జిహ్వాగ్రమున సరస్వతిని, జిహ్వచే ఉత్సాదుని, తాలువులచే అవక్రందుణి, హనువులచే వాజమును, ముఖముచే జలదేవతలకు ముదము చేకూర్చదును.

అండకోశములచే వరుణదేవునకు, గడ్డపు వెంట్రుకలచే ఆదిత్యులకు, మీసములచే పన్థానం, కనుబొమలచే

ద్యావాపృథ్వులకు, కంటిపాపలచే విద్యుత్తులకు ముదము కలిగింతును.

శుక్లాయ స్వాహా. కృష్ణాయస్వాహా.

నేత్రలోమములు, కంటిరెప్పలు పారదేవతాకములు. అవార్యాణి పక్ష్మాణి.

2. అశ్వపు ప్రాణమున వాయువును, అపానమున నాసికను, క్రిందిపెదవిచే ఉపయామమును, పై పెదవిచే సత్తును, పైకాంతిచే అంతరమును, దిగువ కాంతిచే బాహ్యమును, మూర్ధమున నివేష్యమును, తలలోని మెదడుచే స్తయత్నను, మస్తిష్కమున అశ్వినులను, కనీనికములచే విద్యుత్తును, కర్ణములచే శ్రోత్రమును, శ్రోత్రములచే కర్ణములను, నిమ్న కంఠముచే తేదనిని, శుష్కకంఠమున జలమును, మెడవెనుక ఉండు మన్య నాడులచే చిత్తమును సంతోషపెట్టుదును.

అదితిని శీర్షమునమ్ నిర్జల్పమున నిరృతిని, సంక్రోశమున ప్రాణమును, స్తుపమున రేష్మణమును ఆనందపరతును.

3. మశకములచే వెంట్రుకలను, స్వపసమున ఇంద్రుని, దుముకుట వలన బృహస్పతిని, ఖురముల కూర్మమును, స్థూలగుచ్ఛములచే ఆక్రమణమును, నాడులచే కపింజలమును, జంఘలచే జవమును, బాహువులచే అధ్వానమును, మోకాళ్లచే అరణ్యమును, ఊరువులచే అగ్నిని, భుజములచే పూషను, స్కంధములచే అశ్వినులను, స్కంధగ్రంధులచే రుద్రుని ఆనందింపచేతుము.

4. (గుర్రపు ప్రక్క టెముకలను 'వంక్రి' అందురు. అవి ఒకవైపు 13 మరొకవైపు 13 ఉండును. ఇది వాటి దేవతానిరూపణ)

అగ్నికి మొదటివంక్రిచే, వాయువునకు క్రింద వంక్రిచే, ఇంద్రుని మూడవ దానిచే, సోమమును నాలుగవ దానిచే, అదితికి అయిదవ దానిచే, ఇంద్రాణిని ఆరవదానిచే, మరుత్తులను ఏడవదానిచే, బృహస్పతిని ఎనిమిదవ దానిచే, ఆర్యమను తొమ్మిదవ దానిచే, ధాతను పదవదానిచే, ఇంద్రుని పదకొండవ దానిచే, వరుణుని పన్నెండవ దానిచే యముని పదమూడవ వంక్రిచే ప్రీతులను చేయుదుము.

5. (రెండవ ప్రక్కనుంచి)

ఇంద్రాగ్నులను తొలివంక్రిచే, సరస్వతిని రెండవదానిచే, మిత్రుని మూడవ దానిచే, నిరృతిని నాలుగవ దానిచే, అగ్ని, సోములను అయిదవ దానిచే, సర్పములను ఆరవదానిచే, విష్ణువును ఏడవదానిచే, అగ్ని, సోములను అయిదవ దానిచే, సర్పములను ఆరవదానిచే, విష్ణువును ఏడవదానిచే, పూషను ఎనిమిదవ దానిచే, త్వష్టను తొమ్మిదవ దానిచే, ఇంద్రుని పదవ దానిచే, వరుణుని పదకొండవ దానిచే, యముని పన్నెండవ దానిచే, జలమును పదమూడవ దానిచే ప్రీతులను చేతుము. ద్యావాపృథివ్యో దక్షిణం పార్శ్వం విశ్వేషా దేవానాముత్తరం.

6. (అథాంగాంతరాణాం దేవతా ఆహ)

మరుత్తులకు స్కంధములచే, విశ్వేదేవతలకు ప్రథమకీకసముచే, రుద్రులకు రెండవదానిచే, ఆదిత్యులకు మూడవ దానిచే, అగ్ని సోములను నితంబములచే, కుంజమును శ్రోణులచే, ఇంద్రబృహస్పతులను ఊరువులచే. మిత్రావరుణులను ఊరుసంధులచే, ఆక్రమణమును నితంబస్థూలభాగముచే, బలమును నితంబస్థ కూపకులచే సంప్రీతులను చేయుచున్నాము.

7. పెద్దపేగులచే పూషను స్థూలగుదమున అంధసర్పములచే నిహుతుని, హస్తిచే జలమును, అండకోశములచే వృషణుని, శేఫమున వాజిని, రేతస్సుచే ప్రజను, పిత్తకోశమున  చాషుని, పాయువున ప్రదరుని, విష్ఠపిండములచే కూశ్మానమును సంప్రీతులను చేయుచున్నాము.

8. ఇంద్రుని క్రోడమున, అదితిని పాజస్యమున, దిశలను జత్రువున, ఆదిత్యులను భసతమున, జీమూతమును హృదయస్థ మాంసమున, అంతరిక్షమును ఆంత్రమున, నభమును హృదయస్థ మాంసమున, చక్రవాకములను మతస్నాయువులచే, దివమును వృక్కమున, గిరిని నాడ్యగ్ర భాగములచే, ఉపలములను ప్లీహమున, వాల్మీకములను క్లోమమున, గుల్మములను నవనాడులచే, స్రవంతులను హిరములచే, హ్రదములను కుక్షులచే, సముద్రమును జఠరమున, వైశ్వానరుని భస్మమున సంప్రీతులను చేయుచున్నాము.

9. నాభిచే విధృతిని, రసమున ఘృతమును, పక్వాన్ని రసమున జలమును వసాబిందువులచే మరీచులను, శరీరగత ఊష్మమున నీహారమును, వసచే శీనమును. బాష్పములచే పృష్వను, కంటిపుసులచే హ్లాదునిని, రుధిరమున రాక్షసులను, అనుక్త అంగముల చిత్రదేవులను, రూపమున నక్షత్రములను, చర్మమున పృథివిని ఆనందపరచుచున్నాము. జుమ్భకాయ స్వాహా.

10. హిరణ్య గర్భః సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్|
సదాధార పృథివీం ద్యాముతేమాం కస్మైదేవాయ హవిషా విధేమ ||

23-1 చూడగలరు.

11. యః ప్రాణతో నిమేషతో మహిత్వైక ఇద్రాజా జగతో బభూవ|
య ఈశే అస్యద్విపద శ్చతుష్పదః కస్మైదేవాయ హవిషా విధేయ ||

23- 3 చూడగలరు.

12. ఎవని మహిమకు ప్రతీకగా ఈ హిమవత్పర్వతము ఈ హిమవత్పర్వతము నిలిచి ఉన్నదో, ఎవని మహిమను నదుల సహితముగ సముద్రము గానము చేయుచున్నదో, ఎవని భుజములు ఈ విశాల దిశలగునో అట్టి ప్రజాపతికి హవిస్సులు అర్పించుచున్నాము.

13. ఎవడు ఆత్మను, బలమును ప్రసాదించువాడో, ఎవని శాసనమున సకల విశ్వములు ప్రవర్తిల్లునో, ఎవని ఆజ్ఞను సకలదేవతలు అనుసరింతురో, ఎవని కరుణ అమృతస్వరూపమగునో, ఎవని క్రోధము మృత్యువగునో అట్టి ప్రజాపతికి హవిస్సులు అర్పించుచున్నాము.

14. సకల దిశలందు మమ్ము ఆహింసితులను, అనాక్రాంతులను చేయునదియు, శత్రుభేదకమును, శుభప్రదమును అగు యజ్ఞము మాకు లభించును గాత. దేవతలు మాకు సదా అభ్యుదయము కలిగింతురు గాథ. వారు అప్రమత్తులై ప్రతినిత్యము మమ్ము రక్షింతురు గాత.

15. దేవతల శుభప్రదమగు సహృదయము మా విషయమున మరింత నిజమగును గాత. మాకు సదా దేవతల దానము లభించును గాత. మేము నిత్యము దేవతల స్నేహ పాత్రులము అగుదుము గాత. మాజీవనమునకు గాను దేవతలు మా ఆయువులను మరింత పొడిగింతురు గాత, "దేవా న ఆయుః జీవసే".

16. ప్రాచీనస్తుతులచే మేము భగుని, మిత్రుని, అదితిని, అహింసక దక్షుని ఆహ్వానించుచున్నాము. వారితో ఆర్యను, వరుణ, సోమ అశ్వినులను కూడ ఆహ్వానించుచున్నాము. సుభగ సరస్వతి మాకు శుభములు కలిగించవలెను.

17. వాయుదేవత ఔషధము వంటి గాలిని సుఖకరమగునట్లు వీచును గాత. తల్లిభూమి తండ్రి ద్యులోకము అట్లే చేయుదురు గాత. సోమాభిషావకములు, సుఖస్థానములగు శిలలు మాకు అవే సుఖసంతోషములను కలిగింతురు గాత. అశ్వినులారా! మీరు స్వచ్ఛందముగా మాకు ఆ సుఖ సంతోషములనే కలిగించండి.

18. అతడు ఈశానుడు. సమస్త జగత్పతి. బుద్ధిని వికసింపచేయువాడు. సకల ఐశ్వర్య వంతుడు. అతనినే - అతనినే మేము ఆహ్వానించుచున్నాము.

పూష మా ధనములను వృద్ధి పరచును. అతడే రక్షక, పాలక, అనుపహింసిత పూష మాకు శుభములు కలిగించవలెను.

19. స్వస్తిన ఇంద్రో వృద్ధ శ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః |
స్వస్తి నస్తార్క్ష్యోఽరిష్టనేమిః స్వస్తినో బృహస్పతి ర్దధాతు ||

20. పృశ్నిమాతరములగు పృషదశ్వములు శుభగతులు - యుద్ధమునకు సాగువారు మా యజ్ఞమునకు

విచ్చేయవలెను. అగ్ని జిహ్వులు, ఆలోచనాపరులు, సూర్య ప్రకాశులగు మరుత్తులు మా యజ్ఞమునకు విచ్చేయవలెను. తమ సకల రక్షణలచే విశ్వేదేవతలు మా యజ్ఞమును విచ్చేయవలెను.

21. దేవతలారా! భద్రం కర్ణేభిః శ్రుణుయామ. యజనీయ దేవతలారా! భద్రం పశ్యేమ అక్షిభిః | మా సర్వాంగములు స్థిరములు కావలెను. మేము సదా దేవతలను స్తుతించు చుండవలెను. దేవతలు ప్రసాదించిన ఆయువు మా దేములందు నిలువ వలెను.

22. దేవతలారా! శతశరత్తులు గడిచిపోవును. ఈ వ్యవధి లోనే మా దేహములకు వార్ధక్యము ఏర్పరచినారు. అప్పుడే మా పుత్రులు తండ్రులగుదురు. జీవన యానపు ఆయువును మధ్యలో త్రుంచకండి.

(జరసం తనూనామ్, వార్ధక్యము దేహమునకు మాత్రమే! పుత్రాసో యత్ర పితరో భవంతి, తన కొడుకులు తండ్రులైనప్పుడు వార్ధక్యము)

23. అదితి ద్యులోకమగును. అదితి అంతరిక్షమగును. అదితి తల్లియగును. అదితి తండ్రియగును. అదితి పుత్రుడగును. అదితి విశ్వే దేవతలగును. అదితి పంచమానవులగును. ఇంత ఏల అదితియే స్పష్టి. అదితియే ప్రజనన శక్తి. అదితర్జాత మదితిర్జనిత్వమ్.

24. అశ్వము దేవభూతము. సర్పణశీలము. అట్టి అశ్వమును మేము యజ్ఞమున వర్ణించుచున్నాము. కావున మిత్రా వరుణులు, ఆర్యమ, వాయు, ఇంద్ర, ఋభుక్ష, మరుత్తులు మమ్ము నిందించరాదు.

25. అశ్వము స్నానమున పరిశుద్ధమైనది. ధనముచే కప్పబడినది. ఆజ్యసక్తు, ధనధాన్యాదుల సహితముగా అశ్వము ముందు సాగినది. ఆ వంటల పరిమళమునకు వెనుక వచ్చుచున్న ఇంద్ర పూషాదులకు ప్రియ భక్ష్యమును, మేమే అను - మేక ముందుకు ఉరుకుచున్నది.

26. ఈ మేక పూష దేవత యొక్క భాగము. విశ్వేదేవతల హితకర్త. వేగవంత అశ్వము మేకను తన ముందుకు తెచ్చుకొనును. అప్పుడు ప్రజాపతి త్వష్ట దేవతలకు ప్రియమైనదియు, ప్రథమ దేయమును అయిన మేకను అశ్వము దగ్గరకు చేర్చును.

27. అశ్వము హవిర్భూత. ప్రతి ఋతువున దేవయాన పథగామి. ముగ్గురు మానవ హోతలు కుశములచే నీళ్ళు చల్లి అశ్వమును పవిత్రము చేయుదురు. అప్పుడు, పూషకు ప్రథమ యజ్ఞ భాగమగు మేక తన పలుకుణ దేవతలకు యజ్ఞ సూచన ఇచ్చును. ముందునకు వచ్చును.

28. హోతలారా! అధ్వర్యులారా! ప్రతిపస్థాతలారా! అగ్నిమిన్ధులారా! గ్రావస్తోతలారా ! ప్రశస్తలారా! బ్రహ్మా! ఈ

అశ్వమేధము సులక్షణ అలంకృతము, సమ్యక్ హుతము. ఈ యజ్ఞపు పయో, దధి, పయస్య, పురోడాశాదులను దానము చేయండి.

29. యూపము కొరకు చెట్టు కొట్టిన వారున్నారు. కొట్టిన చెట్టును మోసిన వారున్నారు. యూపపు అగ్ర భాగమున కట్టవలసిన ముక్కలను చెక్కినవారున్నారు. అశ్వము కొరకు చేయవలసిన వంటకు కట్టెలు చేర్చినవారున్నారు. వారందరి శ్రమ ఈ యజ్ఞమును సఫలము చేయును గాత.

30. పూజ్యమగు ఈ యజ్ఞఫలము నాకు లభించినది! ఆ యజ్ఞ ఫలము నాలో చేరినది. ఈ అశ్వము దేవతల ఆశలను సఫలము చేయును గాత. దీనివలన విద్వాంసులు, ఋషులు ఆనందింతురు గాత. ఈ అశ్వము దేవతలకు పుష్టి కలిగించుటకు వారికి బంధువగును గాత.

31. వేగవంత అశ్వపు త్రాడు, దాని జీను, తలకు కట్టిన త్రాడు, నోటికి వేసిన కళ్ళెము, దాని గడ్డి మున్నగునవి ఇక దేవతలకు చేరును గాత.

32. ఈగలు ముసిరిన అశ్వమాంసము. నరుకునపుడు కత్తికి అంటిన అశ్వమాంసము. కసాయి వాని చేతులకు, గోళ్ళలో చేరిన అశ్వమాంసము ఇక దేవతలకు చేరును గాత.

33. అశ్వపు పేగులందు సగము అరిగిన గడ్డి ఉండును. అది కోసినంత బయటపడును. పచ్చి మాంసము వాసన ఉండును. దానిని కోయునట్టి పుణ్యాత్ములు వానిని శుభ్రము చేయవలెను. వంటవారు అశ్వపు మేధ మున్నగు మాంసమును, కరిగిపోకుండ, పచ్చి లేకుండ, వండవలెను.

34. అశ్వమాంసము, నిప్పు మీద బాణలిలో వండినపుడు నెల మీద పడును. అది నెలపాలయినట్లు కాని, గడ్డిగాదమున కలసినట్లుగాని కాదు. అది సాంతము దేవతలకు చేరినది.

(భూమి దేవతయే కదా!)

35. అశ్వమాంసము ఉడుకునపుడు ఆహా! ఎంత మంచి పరిమళము అనువారుందురు. ఉడికినది తీసికొని పొండు అనువారుందురు. మాంసపు భిక్ష అడుగువారుందురు. వారందరి సంకల్పములు మా యజ్ఞమును సఫలము చేయవలెను.

36. మాంసము వండునపుడు మాటిమాటికి చూడవలసిన గిన్నె ఉండును. ఉడికినంత గుమ్మరించవలసిన గిన్నె ఉండును. అది చల్లారకుండ పెట్టవలసిన మూత ఉండును. మాంస రూప హృదయాదులను చూపు యష్టి మున్నగు పనిముట్లుండును. కోయుటకు ఉపయోగపడిన కత్తులుండును. అవన్నియు అశ్వమును దేవయోగ్యము చేయును.

37. అశ్వమా! పొగకప్పిన నిప్పు నిన్ను వండునప్పుడు చప్పుడు చేయకుండవలెను. ఉడుకు మాంసము నుండి సద్ బుద్ చప్పుడు రాకుండవలెను. అగ్ని మంట నుండి నీ వాసనను సతతము చూచునప్పుడు కదలకుండవలెను. యాజిత, భక్షిత, ఉద్యమిత, వషట్ కృతమయిన ఈ అశ్వమాంసమును దేవతలు గ్రహింతురు. 'దేవాసఃప్రతిగృభ్ణ్యన్త్యశ్వమ్'

38. అశ్వము వెడలుట, కూర్చుండుట, పోర్లుట, పదబంధము, అది త్రాగిన నీరు, తిన్న గడ్డి సర్వము దేవతలను చేరును గాత.

39. అశ్వమును కప్పిన బట్ట, క్రింద పరచిన బట్ట, అశ్వమునకు కట్టిన స్వర్ణ ముద్రలు శిరో భూషణము, పాద బంధము, ఇవన్నియు ప్రియకర్మపు అశ్వము దేవతలను చేరు ఉపయమగును.

40. అశ్వమా! రౌతు నిన్ను ఉరికించినాడు. నీవు ఉస్సురుమన్నపుడు ఉరికించినాడు. మడమలతో తన్ని, కొరడాతో కొట్టి నీకు బాధ కలిగించినాడు. ఉరికించినాడు. నేను స్రువమున యజ్ఞమున హవి అర్పించియు, మంత్రములు చదివియు నీ యొక్క ఆ బాధను పోగొట్టుచున్నాను.

41. వేగవంతము, దేవప్రియమగు అశ్వపు నలుబది మూడు వంక్రులను కరవాలము ఛేదించును. ఋత్విజులారా! జ్ఞానవంతులై అశ్వపు ఒక్కొక్క అవయవమును ప్రకటించండి. దీని ప్రత్యంగమును దొషరహితము చేయండి. తదుపరి ఛేదించండి.

(4వ మంత్రమున వంక్రులు 26గా చెప్పబడినది. తానిచప్రతి పార్శ్వం త్రయోదశ భవంతి అని ఉవటుడు. 4,5 మంత్రములందు సహితము త్రయోదశి, త్రయోదశీ అని చెప్పబడినది. ఇచట మంత్రమున'చతురస్త్రింశత్' అని చెప్పినాడు)

42. అశ్వమును నరుకువాడు ఒక్క ప్రజాపతి. ద్యావాపృథ్వులు ఉభయులు అతనిని నియంత్రించువారు.

అశ్వమా! నేను అధ్వర్యును. నీ అవయవములను ఛేదించుచున్నాను. అట్లు వేరు చేసిన మాంస పిండములను అగ్నియందు హోమము చేయుచున్నాను.

(దేవతల కొరకు గాని నాకు కాదని చెప్పుట)

43. అశ్వమా! నీవు స్వర్గమునకు ఏగుచున్నావు. అప్పుడు నీ శరీరము నీకు ఆటంకము కాకుండును గాత. ఈ ఖడ్గము నీ శరీరమును ఆపకుండును గాత. ఆశాపరుడు, అకుశలుడు అగు కసాయి సహితము నీ శరీరమును శాస్త్ర

సమ్మతముగా ఛేదించును. కోసి వృథా చేయడు.

44. అశ్వమా! నీవు యజ్ఞము కొరకు వధించబడినావు. నవా ఉపతన్మ్రియతే న ఋష్యసి. అందువలన నీకు మరణము కలుగదు. నష్టము కలుగదు. ఇక నీవు దేవ మార్గములందు సాగుదువు. నీవు పయనించు రథమునకు ఇంద్రుని హర్యశ్వములు, మరుత్తుల పృషతులు పూన్చబడును. అశ్వినుల రాసభము ముందు మరింత వేగవంత అశ్వము సాగును.

45. దేవత్వమునకు చేరుకున్న వేగవంత అశ్వమా! మమ్ము గోయుతులను, అశ్వవంతులను చేయుము. పురుషార్థులగు పుత్రవంతులను చేయుము. వీరినందరిని పోషించతగినంత ధనమును ప్రసాదించుము. అఖండ్య అశ్వమా! మమ్ము పాపరహితులను చేయుము. హవిర్యుక్త అశ్వమా! మాకు రాజ్యప్రదానము చేయుము.

46. మేము అశ్వమేధము చేసినాము. ఈ లోకములను సాధించినాము. విశ్వే దేవతలు, మరుద్గణ, ఆదిత్య సహితుడగు ఇంద్రుడు మాకు వైద్యము చేయుదురు గాత. ఆదిత్యులతో కూడిన ఇంద్రుడు మా యజ్ఞమును, మా దేహములను రక్షించును గాత.

47. అగ్నీ! నీవు మాకు కడు దగ్గరివాడవగుము. మాకు రక్షకుడవు, శరణమవు. శుభంకరుడ వగుము.

అగ్నీ! నీవు వాసకుడవు. ధనదానమున కీర్తిశాలివి. నీవు మా యజ్ఞమునకు విచ్చేయుము. మాకు దీప్తియుక్త ధనము ప్రసాదించుము.

అగ్నీ! నీవు అత్యంత దీప్తివంతుడవు. అందరిని ప్రకాశింప చేయువాడవు. మిత్రుల సుఖము కొరకు నిన్ను ధనము యాచించుచున్నాము.

అగ్నీ! మా ఆహ్వానములు ఆలకించుము. హింసకులందరినుండి మమ్ము రక్షింపుము.

ఆలోచనామృతము

1. ఇది భారత దేశము. సుందర దేశము మహోన్నత దేశము. సనాతన దేశము.

ఇది ఆర్యావర్తము. ఇది పుణ్య భూమి. పునీతన భూమి. పుష్ప పరిమళభూమి.

ఇచటి మునులు, ఋషులు, జిజ్ఞాసువులు, విద్వాంసులు సమస్త మానవ కళ్యాణమునకు నిరంతరము వారి జీవితములను కప్పురములుగ కరిగించినారు. వారు తమ కొరకు ఇసుమంత ఆశించలేదు. సర్వేపి సుఖిస్సంతు,

సమస్త మానవాళి సుఖజీవనమునకు పూలబాటలు పరచినారు!

ఈ అదృష్టము, ఈ భాగ్యము, ఈ సంపద భరత జాతికి మాత్రమే దక్కినది. ఇది ఆర్యావర్తః పుణ్యభూమిః

2. అపౌరుషేయము, భగవత్ప్రసాదము, మునిజన సేవితములగు వేదములు రత్ననిధులు. ఇవి భారతదేశమున అవతరించినవి. కాని సకల మానవాళి హితము కోరునవి. ఇందలి సదాశయములు, మహోన్నత ఆలోచనలు, విశాలతమ దృక్పథములు మరెచ్చటనుకానము.

ఆనోభద్రాః క్రతవో యన్తు విశ్వతోఽదబ్ధాసో అపరితాస ఉద్భితః
దేవానో యథా సదమిద్వృతే ఆసన్నప్రాయువో రక్షితారో దేవేదివి 25 - 14

ఇంతటి ఉదాత్తములగు ఆలోచనములు వేదములు, ఉపనిషత్తులు, భారత సాహిత్యమునకే సాధ్యపడినది.

ఇదంతయు కొంచెపు పాశ్చాత్య నాగరికతకు తాకట్టు పడి ఉండుట భారతజనుల దైన్యము, దుస్థితి, దాస్యమును తెలియపరచుచున్నది.

ఇది సూర్యునకు పట్టిన గ్రహణము మాత్రమే! ఇవి భారత సంస్కృతీ భానుని కాంతి పుంజములను కప్పి ఉంచలేవు. సూర్యుని వెలుగు ప్రసరించకపోదు. ఈ జాతి మరల మానవాళికి మార్గదర్శకము కాకపోదు.

3. యజ్ఞ యాగాది క్రతువులు, హోమ కుండములు, మనసులను కదలించు మంత్రములు, పరాత్పరుని గురించిన చర్చలు, మానవ కళ్యాణపు ఆలోచనలు ఇవన్నియు భారతదేశమునకు, భారత జాతికి మాత్రమే దక్కిన మహా వరములు. వీనిని పాటించిన భారతజాతి మరొకసారి మానవ జాతికి తలమానికమగును.

అశ్వమేధ మంత్రములు మనసును కదలించునవి. కన్నులను తడిచేయునవి. మంత్రములకు ఆ శక్తి ఉన్నది. మనిషి మనసు ఎత్తులను పెంచగలవు. నరుని మానవుని చేయగలవు. మహోన్నతుని చేయగలవు. ఆ నాదమునకు ఆశక్తి ఉన్నది!

అశ్వమేధము యాగములందు ప్రదానము. ఈ విషయము పురాణాదులందు వ్యక్తమయినది. దీనిని గురించి చదివిన, అనువదించిననే మనసు పులకించినది! నేత్రములు బాష్పాకులములయినవి!! కనులారా గాంచిన ఎట్లుండెడిదో!!!

వేదములకు సకల ప్రాణి జాలము అనంతమైన ప్రేమానురాగములు! అశ్వము, అదెంత! దానికి నోరున్నదా? జ్ఞానమున్నదా? కాని వేదము అశ్వమును అట్లు పరిగణించలేదు.

అశ్వమును వధించిన మాట వాస్తవము. ఆ వధ ఎవరి కొరకు జరిగినది? సంకుచిత స్వార్థమునకు కాదు. సమస్త మానవాళి కళ్యాణమునకు! దేవతలను ప్రీతులను చేయుటకు!

అశ్వవధకు ఏర్పడిన అనంత కర్మకాండ మహా మంత్రములు! యాగములు!! అగ్నిహోత్రము!!! ఇది ఒక జంతువునకు జరుగు సంస్కారమా! ఒక దేవతకు జరుగు ఆరాధనయా!

'న వా ఉ ఏత న్మ్రియసే నరిష్యసి' నీకు మరణము లేదు. నష్టము లేదు అనుచున్నాడు.

అశ్వమును స్వర్గమునకు సాగనంపిన తీరు ఆమోఘము!!!

ఇంద్రుని హర్యశ్వములు ఆ అశ్వపు రథమునకు తగులునట! మరుత్తుల పృషతులు తగులునట! అశ్వనుల రాసభములు ముందర సాగునట! వానికి అగ్రమున వేగవంత అశ్వము సాగునట!

మానవుడే అశ్వమును పెంచినాడు! మానవుడే అశ్వమునకు తనంతటి అంతస్థు కలిగించినాడు. మానవుడే దానిని వధించినాడు! మానవుడే దానికి ఎంతయో కర్మ చేసినాడు. మానవుడే అశ్వమును దేవతలందు చేర్చినాడు! మానవుడే దేవత అయిన అశ్వమును ప్రార్థించుచున్నాడు!!!

సుగవ్యం నో వాజీ స్వశ్వ్యయం పుంసః పుత్రంఉత విశ్వాపుషం రాయిమ్ |
అనాగాస్త్వం నో అదితిః కృణోతు క్షత్రంనో అశ్వో వనతాంహవిష్మాన్||

మానవుని మహామహుని చేయుట జంతువును సహితము దేవతను చేయుట ఒక్క వేదమునకు మాత్రమే సాధ్యము. ఇతరమునకు అసాధ్యము! అసాధ్యము!! అసాధ్యము!!!

వేదమునే కాదు, దేనినైనను, కామెర్ల కంటితో చూడరాదు! కామెర్ల కంటికి సకలము పసుపుగనే కనిపించును!! ఎలనన అతని రక్తము పచ్చబారును.

**దాశరథి రంగాచార్య విరచిత**

**శ్రీమదాంధ్ర వచన శుక్ల యజుర్వేద సంహితయందలి**

**అశ్వమేధమంత్రముల ఇరువది అయిదవ అధ్యాయము సమాప్తము**

**"కాలే వర్షతు పర్జన్యః పృథ్వివీ సస్యశాలినీ"**

జ్ఞానానందమయం దేవం నిర్మల స్పటికాకృతం |
ఆధారస్సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ||

## ఇరువది ఆరవ అధ్యాయము

ఇషేత్వేత్యారాభ్య దర్శ పౌర్ణమాస పితుర్య జ్ఞాగ్నిహోత్రో పస్థాన పశుచాతుర్మాస్యాగ్నిష్టోమ
వాజపేయ రాజసూయగ్ని సౌత్రామణ్యశ్వమేధ సంబద్ధామన్త్రా వ్యాఖ్యాతాః|
ఇదానీం ఖిలాన్యుచ్యన్తే || (మహీధరవ్యాఖ్య నుంచి)

1. అగ్నిశ్చపృథివీచ సంన్నతే తే! మే సంన్నమతామదోవాయుశ్చాన్తరిక్షంచ సంన్నతే తే మే సంన్నమతామద ఆదిత్యశ్చద్యౌశ్చ సంన్నతే తేమే సంన్నమతామద ఆపశ్చవరుణశ్చసంన్నతే తే మే సంన్నమతామదః | సప్త సంసదో అష్టమీ భూత సాధనీ| సకామాఁ అధ్వానస్కురు సంజ్ఞానమస్తు మ్కేమునా||

అగ్నియు భూమియు సంగతులగుదురు గాత. సంగతులైన వారు మాకు అనుకూల రగుదురు గాత.

వాయువు అంతరిక్షములు సంగతులగుదురు గాత. సంగతులైనవారు మాకు అనుకూలురు అగుదురు గాత.

ఆదిత్యులు ద్యులోకము సంగతులగుదురు గాత. సంగతులైనవారు మాకు అనుకూలురు అగుదురుగాత.

అగ్ని, అంతరిక్షము, వాయువు, ఆదిత్యులు, ద్యులోకము, జలము, వరుణుడు ఏడుగురు అధిష్టాతలు.

దేవా! మా మార్గములను అభీష్టపూర్ణము చేయుము. మమ్ము సంజ్ఞానులను చేయుము.

2. నేను జనుల కొరకు శుభవాక్కులు పలుకుచున్నాను. అవి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకును, నాఅనుయాయులకును శుభములు కూర్చును గాత. నాఅభీష్టములు వర్ధిల్లును గాత. నేను దానములు ఇచ్చువాడను. దేవతలకు ప్రీతపాత్రుడను కావలెను. దేవదత్తాదులు అనుకూలురు అగుదురు గాత.

3. బృహస్పతీ! ఏవి రమణీయ రత్నాదులగునో, వేటిని సంపన్నులు మిక్కిలి ఆశింతురో, ఏది యజనహేతువగునో, ఏది జనసాధారణులకు కాంతివంతమగునో, ఏది బలమును దీప్తివంతము చేయునో, అట్టివిచిత్ర ధనమును మాకు చేర్చుము.

గ్రహమా! నీవు ఉపయామమున గ్రహించబడినావు. నేను నిన్ను బృహస్పతి కొరకు గ్రహించినాను. ఇది నీస్థానమగును. బృహస్పతి కొరకుగాను నిన్ను ఇచట స్థాపించుచున్నాను.

4. గోవంత ఇంద్రా! ఇచటికి, ఈ యజ్ఞమునకు విచ్చేయుము. ఈ యజ్ఞసోమము శిలలచే అభిషుతమై ఉన్నది. ఈ సోమరసమును పానము చేయుము.

గ్రహమా! నీవు ఉపయామమున గ్రహించబడినావు. నేను నిన్ను గోవంతుడగు ఇంద్రుని కొరకు గ్రహించినాను. ఇది నీ స్థానమగును ఇంద్రుని కొరకు నేను నిన్ను ఇచట స్థాపించుచున్నాను.

5. వృత్రహంతఇంద్రా! నీవు శతప్రజ్ఞవు. ఇచటికి, ఈ యజ్ఞమునకు విచ్చేయుము. ఈ యజ్ఞసోమము శిలలచే అభిషుతమైనది. ఆవుపాలు కలుపబడినది. ఈసోమరసమును పానము చేయుము.

ఉపయామగృహీతోఽసీన్ద్రాయ త్వాగోమత ఏషతే యోనిరిన్ద్రాయ త్వాగోమతే.

(పైమంత్రపు రెండవ పరిచ్ఛేదము దీనికి వచనమగును)

6. వైశ్వానరుడు యజ్ఞవంతుడు. సత్యజ్యోతి రక్షకుడు. అనుపక్షీణుడు. అజసం ధర్మమీమహే, అతనిని అక్షయ ధర్మమును యాచించుచున్నాను.

"ఉపయామగృహీతోఽసి వైశ్వానరాయ త్వైషతే యోని ర్వైశ్వానరాయత్వా"

7. నేను వైశ్వానరుని సద్భావమున నిలుతును గాత. ఆ రాజు భువనములకు శ్రీ వంతుడు. అతడు ఈ భూమినుండియే పుట్టి ఈ భూమిని వీక్షించుచున్నాడు. వైశ్వానరాగ్ని సూర్యుని యందు చేరి ప్రకాశించును.

"ఉపయామ గృహీతోఽసి వైశ్వానరాయ త్వైషతే యోని ర్వైశ్వానరాయత్వా"

8. మమ్ము రక్షించుటకు వైశ్వానరాగ్ని విచ్చేయవలెను. వహనక్షమ ఉక్థలద్వారా విచ్చేయవలెను. సుదూర ప్రాంతము నుండి విచ్చేయవలెను.

"ఉపయామ గృహీతోఽసి వైశ్వానరాయత్వైషతే యోనిర్వైశ్వానరాయ త్వా"

9. అగ్ని ద్రష్ట, పావకుడు. పంచజనులహితుడు. తమీమహే మహాగయమ్, అతనిని మహాగమనము యాచించుచున్నాము.

"ఉపయామ గృహీతోఽస్యగ్నయే త్వావర్చస ఏషతే యోనిరగ్నయే త్వావర్చసే"

10. మహానుడు, వజ్రహస్తుడు, షోడజ ఇంద్రుడు మాకు సుఖములను ప్రసాదించును గాత. అతడు మమ్ము ద్వేషించుపాపిని హతమార్చును గాత.

"ఉపయామ గృహీతోఽసి మహేన్ద్రాయ త్వైషతే యోనిర్మహేన్ద్రాయత్వా"

11. ఇంద్రుడు దర్శనీయుడు. శత్రుంజయుడు. వాసహేతువు. సోమపానమున మదోన్మత్తుడు. యజమానులారా! ఆ ఇంద్రుని మీ కొరకు మేము, నవప్రసూతగోవు తనదూడ కొరకు అంబారవము చేసినట్లు, స్తుతించుచున్నాము.

12. ఉద్గాతలారా! కాంతి ధనుడగు అగ్ని కొరకు, అత్యంత ప్రాపణీయ, బృహత్సామమును గానము చేయండి.

అగ్నీ! మహిషవలె నీధనము, నీ అన్నము దానార్థమే ఉద్గమితమగును.

యథాప్రథమపరిణీతాస్త్రీ గృహాత్ భోగార్థం పతింప్రతి ఉద్గచ్ఛతి. మొదటి భార్య పతి భోగము కొరకు ఇంటినుండి వెడలును. అగ్నియు అట్లే ధన, అన్నములను దానము కొరకే ధరించును.)

13. అగ్నీ! మేము నీస్తుతులు గానము చేయుచున్నాము. ఇంకను గానము చేయుదుము. విచ్చేయుము. సోమరసము సిద్ధముగా ఉన్నది. సేవించుము. మదోన్మత్తుడవగుము. ఏహి- రమ్ము.

14. యజమానీ! ఋతువులు నీయజ్ఞమును విస్తరించును గాత. మాసములు హవిని రక్షించును గాత. సంవత్సరములు నీ యజ్ఞమును భరించును గాత]. వారందరు మాసంతతిని పాలింతురు గాత.

15. పర్వతముల వద్దను, నదుల సంగమ స్థలములందును, విప్రుల బుద్ధియందును సోమము వర్ధిల్లును.

16. సోమమా! నీ రసాంశము పైకి ఎగిసినది. ఆహుతుల ద్వారా ద్యులోకమునకు చేరినది. అదే వర్షరూపము దాల్చినది. ఉగ్ర, సుఖస్వరూప, మహాకీర్తిమయమై పృథ్వికి చేరినది.

17. సోమమా! నీవు ధనప్రాపకుడవు. యజనీయ ఇంద్ర, వరుణ, మరుత్తుల కొరకు అభిషుతమగుము.

18. మానవుల సమస్త ధనములను సోమస్వామి మావద్దకు చేర్చవలెను. దానిని మేము వితరణ చేయుదుము. అనుభవింతుము.

19. దేవతలు మా యజ్ఞములను ఋతువుల ననుసరించి స్వీకరింతురు గాత. అట్లయిన మేము గోవులు, అశ్వములు, పుత్రులు అన్యపదార్థములందు సమృద్ధులము అగుదుము. ద్విపద, చతుష్పాత్తులచే మేము పరిపుష్టులము అగుదుము.

20. అగ్నీ! మంచిని కోరు దేవపత్నులను, త్వష్టను కూడ సోమపానమునకు తీసికోని రమ్ము.

21.ఋతుదేవతలారా! మాయజ్ఞమును కీర్తించండి.

బహుపత్నుల అగ్నీ! నేష్టా! సోమపానము చేయండి.

మీరే కదా రత్నములిచ్చువారు. త్వంహిరత్నధా అసి.

22. ఋత్విజులారా! అగ్ని ధనదాత. అత్యంత సోమప్రియుడు. అగ్నికి సోమపు ఆహుతులు అర్పించండి. అందుకు సంబంధించిన పనులు చేయండి. నేష్టసహితము దేవతలతో కూడి సోమపానము చేయును గాత.

23. ఇంద్రా! ఇదిగో ఈ సోమరసము నీకొరకే వేచి ఉన్నది. రమ్ము ప్రసన్నుడవగుము. యథేచ్ఛగా సేవింపుము. ఈ దర్భాసనమును కూర్చుండుము. సోమరసమును నీ ఉదరమున పోయుము.

24. దేవపత్నులారా! మీరు ఆహ్వాన సులభులు, రండి. విచ్చేయండి. దర్భాసనము మీద కూర్చొనండి. ముచ్చట్లాడండి. త్వష్టా! దేవపత్నుల సహితుడవై, సచ్ఛీలుడవగునీవు, స్వేచ్ఛగా సోమము సేవించుము. మదోన్మత్తుడవగుము.

25. సోమమా! ఎంతో రుచికరమవై, మాదకమవై ధారగా పవిత్రమగుము. ఇంద్రుని పానమునకు అభిషుతమగుము.

26. సోమమా! రాక్షసహంత. విశ్వద్రష్ట. సోమపాత్ర ఇనుమున మలచబడి సోమము నిలుచునట్లు చేయబడినది. సోమము ద్రోణకలశమున ప్రశాంతముగా చేరును గాత.

శ్రీమదాంధ్ర వచన శుక్ల యజుర్వేద సంహితయందలి

అనుక్త మంత్రకథనమను ఇరువది ఆరవ అధ్యాయము సమాప్తము.

లోకాస్సమస్తాస్సుఖినోభవంతు.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతం |

ఆధారస్సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ||

## ఇరువది ఏడవ అధ్యాయము

1. సమాస్త్వాగ్న ఋతవో వర్ధయంతు సంవత్సరా ఋషయో యానిసత్యా|
సం దివ్యేన దీదిహి రోచనేన విశ్వా ఆభాహి ప్రదిశాశ్చతస్రః||

అగ్నీ! వర్షము, ఋతువులు, సంవత్సరములు, ఋషులు, సత్యము నిన్ను వర్ధిల్లచేయవలెను. నీవు నీదివ్య ప్రభచే దేదీప్య మానుడవగుము. సంపూర్ణముగ నలు దిశలను ప్రకాశింపచేయుము.

2. అగ్నీ! సమింధితుడవు అగుము. యజమానిని ప్రబోధితుని చేయుము. మహాసౌభాగ్యము కొరకు నిలువుము.

అగ్నీ! యజమాని నీకు దగ్గరగా కూర్చుండును. అతనిని బాధించకుము. నీ ఋత్విజులే యశోవంతులు అగుదురు గాత - ఇతరులు కాదు - మాన్యే.

3. అగ్నీ! ఈ ఋత్విజులు నిన్ను కీర్తించుచున్నారు. వినుము. మాకు కళ్యాణ కారివి ఆగుము.

అగ్నీ! నీవు శత్రుహంతవు. మా శత్రువును జయించువాడవు. నీవు ప్రమాద రహితుడవగుము. యజ్ఞగృహమున నిరంతరము ప్రజ్వరిల్లుము.

4. అగ్నీ! నీవు ఇచట ధనమును వహింపుము. పూర్వము అగ్ని చయనము చేసినవారు నీచే తిరస్కరింపబడకుందురు గాత. క్షత్రియులు నీ అధీనమున ఉందురు గాత. నిన్ను ఉపాసించు యజమానికి బాధలు ఉండరాదు. అతడు వర్ధిల్లవలెను.

5. దీర్ఘాయువు అగ్నీ! క్షత్రియుల ద్వారా ఉద్దీప్తుడవు అగుము. మిత్ర సూర్యుని కలసి నీ మిత్రుడగు యజమానికి హితము చేకూర్చుము.

అగ్నీ! మా సజాతుల మధ్య నిలువుము. వర్ధిల్లుము. నీవు రాజుల యజ్ఞములకు వివిధ రూపముల

ఆహ్వానించబడువాడవు. దేదీప్యమానుడవగుము. "దీదిహీహ"

6. అగ్నీ! నిహంతలను, హింసకులను, అన్య మనస్కులను అదాతలను లంఘింపుము. పాపములను పారద్రోలుము. తదుపరి మాకు వీరపుత్రయుక్త ధనమును ప్రసాదించుము.

7. జాతవేద అగ్నీ! నీవు ఆహింసితుడవు. అక్షయుడవు. విశేషరూపమున శోభాయమానుడవు. క్షత్రియులచే ఉద్దీప్తుడవై దేదీప్యమానుడవగుము. మానవులకు గల మృత్యుభయాదులను సకల దిశలనుండి తొలగించుము. నీ యొక్క శుభంకర జ్వాలలచే మమ్ము పాలింపుము. వర్ధిల్లచేయుము.

8. సవితా, బృహస్పతులారా! ఈ యజమానిని ప్రబోధితుని చేయండి. ఇతడు సుమతి. ఇతనిని మరింత సుమతిని చేయండి. ఇతనిని మహా సౌభాగ్యమున వర్ధిల్లచేయండి. ఇతని యజ్ఞమున విశ్వేదేవతలు తృప్తులు అగుదురు గాత.

9. బృహస్పతీ! పరలోక సంబంధములును, యముని నరకాది పాపముల నుండి మాకు విముక్తి కలిగించుము.

దేవ భిషక్కులు అశ్వినులు తమ యుక్తులచే మానుండి మృత్యువును తొలగింతురు గాత.

10. అగ్నీ! మేము పరంజ్యోతిని దర్శింతుము గాత. అంధకారమును దాటుదుము గాత. దేవతలకు ఒకే దేవతయు ఉత్తమ జ్యోతియు అగు సూర్యుని చేరుకుందుము గాత.

11. ఈ అగ్ని సమిధలు ఉన్నతములు కావలెను. ఇతని స్వచ్ఛకాంతి జ్వాలలు ఉన్నతములు కావలెను. యాజమానపుత్రుల ముందు ఈ దీప్తి శిఖలు ఉన్నతములు అగును గాత.

12. అగ్ని జలములకు పౌత్రుడు. ప్రాణవంతుడు. సర్వ ధనవంతుడు. దేవతలకు ఇతడే ద్యోతమానుడు. అగ్ని మా మార్గములను ఘృత, మధుమయములు చేయును గాత. "పథో అనక్తు మధ్వా ఘృతేన"

13. అగ్నీ! నీవు ఋత్విజులచే స్తుతించబడువాడవు. మధుర ఘృతమూలమున యజ్ఞమున వ్యాపించువాడవు. సవిత పుణ్యవంతుడు. లోకములచే కీర్తించబడువాడగును.

14. యజ్ఞము ప్రారంభమైనది. యజ్ఞ నిర్వాహకుడగు అధ్వర్యు జ్ఞానమూర్తి స్తుతించుచు బయలుదేరినాడు. ఘృతము, హవి, స్రువము మున్నగు వానిచే యజ్ఞమునకు వచ్చుచున్నాడు.

15. అధ్వర్యుడు మహిమాన్వితుడగు అగ్నిని యజించును. అగ్ని హవియుతుడు. వాసయితుడు చేతనాప్రదుడు. ధనదాత. అధ్వర్యు అగ్నికి బాలకార హవిస్సులు అర్పించవలెను.

16. ద్వార దేవేరుల వ్రత ధారిణులు. స్థానము గ్రహించినంత యజ్ఞమును ఐశ్వర్య వంతము చేయుదురు. వారు అగ్నికర్మములు వహించి యజ్ఞమును రక్షింతురు. విశ్వే దేవతలు వీరి కార్యములను రక్షింతురు.

17. ఉషా రాత్రులు దేవతాస్త్రీలు, ఈ అగ్నికి భార్యలు వారు. గార్హ్యపత్యాగ్ని యందున్న మమ్ము శాస్త్రోక్తమగు ఈ యజ్ఞమును రక్షింతురు గాత.

18. దైవీహోతలు, అగ్ని, వాయువులు, మా యజ్ఞమును మహోన్నతము చేయుదురు గాత. వారు అగ్ని జ్వాలలను నుతింతురు గాత. మా యజ్ఞమును సఫలమును చేయుదురు గాత.

19. స్తూయమానలగు ముగ్గురు దేవేరులు - ఇడ, సరస్వతి, భారతి - దర్భాసనమున ఆసీనలగుదురు గాత.

20. శీఘ్రముగా లభించునదియు - అద్భుతమును - అనేక స్థానము లందున్నదియు వీర్యశాలి యగు ధనమును త్వష్టదేవుడు మా నాభి స్థానముల పడవేయును గాత.

21. స్రుకమా! అత్యంత హవిర్దానము చేయుము. దేవతలను హవిర్భుక్తులను చేయుము. శాంతియుత అగ్ని హవిని సంస్కరించుచున్నాడు.

22. జాతవేద అగ్నీ! ఇంద్రునకు హవిన్వేకరింపుము. ఈ హవిని విశ్వే దేవతలు ఆస్వాదింతురు గాత.

23. అన్నమున బలిసినవియు ధనవర్ధకములగు నియుతాశ్వములను సుప్రజ్ఞ, శ్వేత వాయువు అధిష్ఠించును. ఆ నియుతములు వాయువు ముందు వచ్చి నిలుచును. అప్పుడు యజమానాదులందరు, సుపుత్ర ప్రాప్తి కలుగు యజ్ఞాది కర్మలు చేయుదురు.

24. ద్యావాపృథ్వులు ధనము కొరకని వాయువును సృష్టించినారు. ఆ ద్యోతమాన వాయువును వాగ్దేవి స్వయముగా స్వీకరించినది. జనాకీర్ణ మార్గములందు శ్వేత, ధనస్వామి వాయువునకు నియుతాశ్వములు లభించును.

25. జలము లోకములన్నింటిని తన గర్భమున దాల్చినది. అట్లు గర్భము దాల్చిన జలము తనలోన వేడిని పుట్టించినది. అప్పుడు దేవతలకు ఏకమాత్ర ప్రాణమగు హిరణ్యగర్భుడు అవతరించినాడు. అతనికి మేము హవిస్సులర్పింతుము. "కస్మైదేవాయహవిషా విధేమ"

26. ఏ అంతర్యామి తన మహిమచే దక్ష ప్రజాపతిని గర్భమున దాల్చినాడో, ఎవడు యజ్ఞమును కల్పించినాడో -

ఎవడు సమస్తజలమును సర్వదిశల నుండి చూచి తెలిసినాడో, ఎవడు దేవతలకు ఏకమాత్ర దేవతయగువో "కస్మైదేవాయహవిషా విధేమ"

27. వాయువా! నీవు నియుత అశ్వముల మీద యజ్ఞము కొరకని యజమాని ఇంటికి వెళ్ళుదువు. అచటి నుండి వచ్చి మాకు అన్నము, సరిపడునంత ధనము, పుత్రులు అశ్వగోధనమును ప్రసాదించుము.

28. వాయువా! నీవు నీ శత, సహస్రక నియుతములతో యజ్ఞమునకు విచ్చేయుము. ఈ తృతీయ సవనమున తృప్తి చెందుము. దేవతలారా! నిరంతరము శుభములు కలిగించి మమ్ము రక్షించండి.

29. వాయువా! నియుతాశ్వ సహితుడవై విచ్చేయుము. శుక్రమను పానపాత్ర నీ కొరకు వేచియున్నది. నీవు సదా అభిషుత గృహమునకు వెళ్ళువాడవు కదా!

30. ఇది దేవయజ్ఞము. శుక్ర గ్రహము నిండుగా సోమపాత్ర సమర్పించుచున్నాను. వాయువా! నియుతాశ్వయుక్తుడవై సోమపానమునకు, ఈ యజ్ఞమునకు విచ్చేయుము.

31. వాయువు అగ్రగంత, యజ్ఞము వలన సంప్రీతుడు, కళ్యాణకారి. అతడు నియుతాశ్వములను, శుభములను వెంటపెట్టుకొని యజ్ఞమునకు రావలెను.

32. వాయువా! నీకు వేనవేల రథములున్నవి. వానిమీద నియుతవంతుడవై సోమపానమునకు విచ్చేయుము.

33. వాయువా! నీవు జగత్ స్వరూపుడవు. నీవు ఒకటి, రెండు, పది, ఇరువది, మూడువందల అశ్వములపై పాత్రలను, ధనమును యజ్ఞమునకు తెచ్చెదవు. వానిని ఇచటనే వదలి వెళ్ళుము.

34. వాయువా! నీవు ఋతపతివి. త్వష్టకు జామాతవు. నిన్ను మేము అన్నములు యాచించు చున్నాము.

35. శూరఇంద్రా! పాలు పితుకని ఆవులు దూడల కొరకు అంబారావము చేసినట్లు, మేము నిన్ను సంస్తుతించుచున్నాము. స్వర్గద్రష్ట, చరాచర జగత్తునకు స్వామిని స్తుతించుచున్నాము.

36. ఇంద్రా! నీవంటివాడు దేవలోకమున లేడు. భూలోకమున లేడు. ఇప్పటికి పుట్టలేదు. ముందు పుట్టబోడు.

ధనవాన్ ఇంద్రా! మేము అశ్వకాములము. హవి సహితులమై గోకామియగు నిన్ను ఆహ్వానించుచున్నాము.

37. ఇంద్రా! అన్నలాభము కొరకు ఋత్విజులు నిన్ను ఆహ్వానించుచున్నారు.

వృత్రహంత ఇంద్రా! మేము వర్షము కోరియు అశ్వములు కోరియు యజ్ఞకర్తలమై, శ్రేష్ఠ పాలకుడవగు నిన్ను ఆహ్వానించుచున్నాము.

38. వజ్రహస్త, పూజనీయ ఇంద్రా! నీ తేజము వలననే నీవు స్తుతించబడుచున్నావు. నీవు గోవులు, రథములు కలవాడవు. జయశీల అశ్వమునకు అన్నము ఇచ్చినట్లు - మాకు అశ్వమునిమ్ము.

39. ఇంద్రుడు విచిత్రుడు. నిత్యము వర్ధిల్లువాడు. అతడు ఏ స్తుతులకు, ఏ అభిషవాడి కేఇయలకు ప్రసన్నుడై మాకు మిత్రుడు కాగలడు?

40. ఇంద్రా! బలములందు అత్యంత బలము కలిగించు హవిరన్నమేది? దేనివలన నీవు బలయుతుడవై గూఢముగా దాచిన గోధనాదులను వెలికి తీయగలవు?

41. ఇంద్రా! నీవు మా మిత్రులకు - నీ స్తోతలకు రక్షకుడవగుము. రక్షించుటకు గాను నీవు వందల రూపములు ధరించువాడవు కదా!

42. అగ్నీ! నీవు అమరుడవు. బలయుతుడవు. జాతప్రజ్ఞవు. నిన్ను యజ్ఞ యజ్ఞమందును, స్తుతి స్తుతియందును, ప్రియమిత్రుని స్తుతించు రీతి కీర్తించుచున్నాను.

43. అగ్నీ! అన్నముల స్వామీ! వాసయితా! నీవు ఒకటి - రెండు - మూడు - నాలుగు స్తుతులచే సంస్తుతుడవగుము. మమ్ము పాలించుము - పాహి.

44. అధ్వర్యులారా! జలపాత్రుడగు అగ్నికి తృప్తి కలిగించండి. అతడు మన హవిని ఆశించుచున్నాడు. దేవతలకు హవి అందించుటకు మేము అగ్నినే సంకల్పించుచున్నాము.

అగ్ని మమ్ము అన్నములకగు యుద్ధములందు రక్షించును గాత. మమ్ము వర్ధిల్ల చేయును గాత. మా పుత్రులను రక్షించును గాత.

45. సంవత్సరోఽసి. పరివత్సరోఽసి, ఇద్వాత్సరోసి. వత్సరోసి

ఉషస్తే కల్పయన్తామ్. అహోరాత్రాస్తే కల్పయంతాం. మాసాస్తే కల్పయంతాం. అర్ధమాసాస్తే కల్పయంతాం. ఋతవస్తే కల్పయన్తామ్. సంవత్సరస్తే కల్పయంతామ్.

అగ్నీ! జనన మరణముల కొరకు వికాస సంకోచములనందుము. నీవు స్వయముగా ప్రసరించుము.

అగ్నీ! నీవు సుపర్ణచిత్తవు. సూర్యుని అనుమతిని అంగిరుల యజ్ఞమునందు వలెనే మాయగణమున సహితము స్థిరపడుము.

దాశరథి రంగాచార్య విరచిత

శ్రీమదాంధ్ర వచన శుక్ల యజుర్వేద సంహితయందలి

అగ్నికమను ఇరువది ఏడవ అధ్యాయము సమాప్తము.

పథో అనక్తు మధ్వా ఘృతేన

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతం |

ఆధారస్సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ||

## ఇరువది ఎనిమిదవ అధ్యాయము

1. హోతా యక్షత్సమిధేన్ద్రమిస్పదే నాభాపృథివ్యాఅధి|
దివే వర్ష్మన్సమిధ్యత ఓజిష్ఠశ్చర్షణీసహాం వేత్వాజ్యస్య హోతర్యజ||

హోత పృథ్విస్థానమగు వేదిమీద ఇంద్రునకు, అగ్నిభావమున సమిధలు అర్పించి యజించవలెను. అంతరిక్షపు నాభి ప్రదేశమునను, ద్యులోకపు ఉత్తమ స్థానమునను, విద్యుత్, సూర్య రూపములచే ఇంద్రుడు యజించబడుచున్నాడు.

ఇంద్రుడు సమర్థుల తలలు వంచగల ఓజస్వి అతడు ఘృతమును సేవించును గాత.

మానవహోతా! నీవు సహితము యజింపుము. హోతర్యజ.

2. ఇంద్రుడు జేత. అపరాజితుడు, స్వర్ణవేత్త, హోతలు ఇంద్రుని, తనూనపాత అగ్నిని, రక్షణలతోను, అత్యంత మధుర హవిస్సులతోను యజించవలెను. తేజస్వియగు నరాశంస అగ్ని సహితుడైన ఇంద్రుడు ఘృతమును సేవించును గాత. "హోతర్యజ"

3. ప్రయాజ దేవతలగు ఇడల సహితముగ సంస్తుతించబడువాడును. అమరుడును అగు ఇంద్రుని హోతలు

యజింపవలెను. దేవసమ బలశాలి, వజ్రహస్తుడు, అసురపుర ధ్వస్త ఇంద్రుడు ఘృతము సేవించును గాత. "హోతర్యజ"

4. ఇంద్రుడు దర్భాసనములపై ఆసీనులగువారిలో శ్రేష్ఠుడు. అభీష్టవరదుడు. యజమానికి హితపు కలిగించువాడు. హోతలు ఇంద్రుని దర్భాసనమున యజించుచున్నారు. వసు, రుద్ర, ఆదిత్య సహితుడై ఇంద్రుడు దర్భాసనమున ఆసీనుడు కావలెను. ఘృతము సేవించివలెను. "హోతర్యజ"

5. ఇంద్రునిలో ఓజస్సు, వీర్యము, సహనము పెంచునట్టి ద్వారదేవేరులను హోత యజించవలెను. సేచక ఇంద్రుని కొరకు గాను, సుగమనలు, యజ్ఞవర్ధినులగు, ద్వారాదేవేరులు ఘృతము సేవింతురు గాత. హోతర్యజ"

6. ఇంద్రుని చక్కని పాడియావులను, మహా మాతలగు ఉషారాత్రులను హోత యజించును గాత. వారిరువురు ఒకేతీరు దూడల ఆవుల వలె, ఇంద్ర రూపవత్సము యొక్క తేజస్సును వర్ధిల్ల చేయుదురు గాత. ఉషారాత్రులు ఘృతమును సేవింతురు గాత. హోతర్యాజ

7. అగ్ని వాయువులు వైద్యులు. పరస్పర మిత్రులు. దైవీ హోతలు. వారిని హోత యజించును గాత. క్రాంతద్రష్టలు విద్వాంసులగు వారలిద్దరు ఇంద్రునకు శక్తి కలిగించుచున్నారు. అగ్ని వాయువులు ఘృతము సేవింతురు గాత. హోతర్యజ

8. ఇడ, సరస్వతి, భారతి అను ముగ్గురు దేవేరులు అగ్ని, వాయు, ఆదిత్య లోకములను ధరించినవారు. భేషజులు, కర్మవంతులు. హోత వారిని యజించును గాత. ఇంద్రుని పాలించువారును, హవిర్యుక్తలగు ముగ్గురు దేవేరులు ఘృతమును సేవింతురు గాత. హోతర్యజ.

9. త్వష్ట ఐశ్వర్యవంతుడు, ద్యోతమానుడు, వైద్యుడు సుయజనీయ ఘృతమున శోభిల్లువాడు, అనేక రూపుడు, సువీర్య వంతుడు, ధనవంతుడు, హోత త్వష్టను యజించును గాత. త్వష్ట ఇంద్రునకు ఇంద్రియ శక్తిని ప్రసాదించును. త్వష్ట ఘృతమును సేవించును గాత. హోతర్యజ.

(త్వష్టః సమిధాంపతే అని తైత్తరీయము)

10. వనస్పతి యూపము హవిసంస్కర్త. శమిత శక్తివంత హూత యూపమును యజించును గాత. యూపము సుగమ ఆహుతులను మధుర ఘృతమున యజ్ఞయుక్తము చేయును. వానిని దేవతలచే ఆస్వాదింపచేయును. యూపము ఘృతమును సేవించును గాత. హోతర్యజ.

11. హోతలు ఇంద్రుని యజింతురు గాత. ఘృత దేవతలకు స్వాహా. మేద దేవతలకు స్వాహా. మేద బిందువులకు స్వాహా. స్వాహా దేవతలకు స్వాహా. హవ్య సూక్తవంత దేవతలకు స్వాహా. ఘృత పాయి దేవతలు ఘృతము సేవింతురు

గాత. ఇంద్రుడు ఘృతము సేవించును గాత. హోతర్యజ

12. వేది మీద పరచిన దర్భాసనము ఋత్విజాదులచే సనాథమైనది. ఇంద్రుడు మున్నగు వారి యుక్తము అది ఇంద్రుని వర్ధిల్ల చేయునది. పగలు కోయబడి రాత్రి అల్లబడి, దర్భత్వ ధనమున ఇతర పదార్థములను తలదన్నిన దర్భ, యజమానికి ధనము కలిగించుట కొరకు ఘృతమును సేవించును గాత. యజ.

13. ద్యోతమాన ద్వారము, కడపచే సంపన్నమైనంత దృఢమై వర్ధిల్ల చేయును. ఉరుకులు పెట్టు యువకులు చేతను, అల్లరి పిల్లలచేతను ఏర్పరచబడి దుమ్ము నిండిన కూపాదులను ద్వారదేవత తొలగించును గాత. యజమాని ఇంట ధనము నింపుటకు ద్వారాదేవేరులు ఘృతము సేవింతురు గాత. యజ.

(యజ్ఞ భ్రంశక రాణి కూపాదీని యజ్ఞమార్గాదపన యన్విత్యర్థః ఇతి ఉవటః| యజ్ఞమునకు ఆటంకము కలిగించు కుపాదులను యజ్ఞమార్గమునుంచి తొలగించమనుట)

14. ద్యోతమాన ఉషా, రాత్రులు ఇంద్రుని యజ్ఞమును ఆహ్వానింతురు గాత. దైవీప్రజ వసు, రుద్ర ఆదిత్య సహితులై ఘృతమును అందుకొందురు గాత. సుప్రసన్నలు. హితకారిణులగు ఉషా, రాత్రులు, యజమాని ఇంట ధనము నింపుటకు ఘృతము సేవింతురు గాత. యజ.

15. ద్యావాపృథ్వులు కాంతిమతులు. సుప్రీతలు. ధనధారులు. వారు ఇంద్రుని వర్ధిల్ల చేయుదురుగాత. వారిరువురిలో ఒకరు పాపములను తొలగింతురు. మరొకరు ధనమును ప్రసాదింతురు. జ్ఞానవతులగు వారు ఉభయులు యజమాని ఇంట ధనమును నింపుటకు, ఘృతము సేవింతురు గాత. యజ.

16. దుగ్ధదాయి మరియు ఊర్జాహుతి దుగ్ధములచే ఇంద్రుని వర్ధిల్ల చేయుదురు గాత. వారిలో ఒకటి అన్నము, బలము కలిగించును. మరొకటి సహభజన, సమపానములు కలిగించుణు. దయామయి ఉర్జాహుతి పురాతన అన్నములచే సూతన అన్నములను కల్పించును. దుగ్ధదాయి యజమానికి ధనము, కోరిన పదార్థములు తెచ్చును. యజమాని ఇంట ధనము నింపుటకు వారిద్దరు ఘృతమును సేవింతురు గాత. యజ.

17. దైవీ హోతలు అగ్ని, వాయు, ఇంద్రదేవతలను వర్ధిల్ల చేయుదురు గాత. నిందకులను వధించు ఆ ఇద్దరు దేవతలు యజమానికి ధనము, కోరిన పదార్థములు ప్రసాదింతురు గాత. యజమాని ఇంట ధనము నింపుటకు వారిరువురు ఘృతము సేవింతురు గాత. యజ.

18. ముగ్గురు దేవేరులు పాలకుడగు ఇంద్రుని వర్ధిల్ల చేయుదురు. భారతి ద్యులోకమును స్పృశించును. సరస్వతి రుద్ర సహితమై యజ్ఞమును స్పృశించును. ధనవతి ఇడ, గృహముల పృథ్విని స్పృశించును. యజమాని ఇంట ధనము నింపుటకు ముగ్గురు దేవేరులు ఘృతము సేవింతురు గాత. యజ.

19. యజ్ఞము ఋత్విజులచే ప్రశంసితము. ద్యుతిమంతము. ధనశాలి. మూడు స్థానములు, మూడు బంధములు కలవాడు. అతడు ఇంద్రుని వర్ధిల్ల చేయును. ఈ యజ్ఞము నలుపు వీపు గల వందల గోవులు కలది. వేల గోవులచే ప్రవర్తిమగునది. మిత్రావరుణులు ఇఅతనికి హోతృకర్మ యోగ్యులు. బృహస్పతి ఉద్గాతృకర్మయోగ్యుడు. అశ్వినులు అధ్వర్యు కర్మయోగ్యులు. యజమాని ఇంటధనము నింపుటకు వారు ఘృతము సేవింతురు గాత, యజ.

20. యూప దేవత దేవతలచే హిరణ్యవర్ణమైనది. మధుర శాఖాయుతము. అశ్వినులు, సరస్వతిచే ఫలవంతము. యూపము ఇంద్రుని వర్ధిల్ల చేయును గాత. ఈ యూపపు అగ్రభాగము ద్యులోకమును, మధ్యభాగము అంతరిక్షమును తాకును. మిగిలిన భాగము భూమిని గట్టి పరచును. యజమానికి ధనము కలిగించుటకును, యజమాని ఇంట ధనము నింపుటకును యూపము ఘృతము సేవించును గాత. యజ.

21. బర్హి ఓషధులందు శ్రేష్ఠము. ఆ బర్హి "దేవమిన్ద్రమ వర్ధయత్" బర్హి సుఖముగా నిలిచినది. ఇంద్రునితో కూడినది. ఇతర బర్హులందు శ్రేష్టమైనది. ఆబర్హి ఇంద్రుని వర్ధిల్ల చేయును గాత. యజమానికి ధనము ప్రసాదించుటకును, అతని ఇంట ధనమును నింపుటకును బర్హి ఘృతము సేవించును గాత. యజ.

22. చక్కని యజనకారి అగ్ని "దేవమిన్ద్రమవర్ధయత్" నేడు అగ్ని సుయజనము చేయుచు మా కోరికలను తీర్చును గాత. యజమానికి ధనదామునకును, అతని ఇంట ధనము నింపుటకును, అగ్ని ఘృతము సేవించును గాత. యజ.

23. నేడు ఈ యజమాని అగ్నిని హోతగా వరించినాడు. వండదగిన వానిని ఉడికించుచు, పురోడాశమును పచనము చేయుచు అగ్ని ఉపస్థితుడైవాడు.

వనస్పతి యూపదేవత ఇంద్రుని కొరకు మేకను కట్టుకొని యజ్ఞమునకు ఉపస్థితిమైనది.

అశ్వినులు మున్నగు దేవతలకు యజమాని పశువు సమర్పించినాడు. వారు మేధతో ప్రారంభించి పశువు యొక్క సర్వాంగములను భక్షించినారు. వండిన మిగత అవయవములను కూడా ఆరగించినారు. వారు పురోడాశమున వృద్ధి చెందినారు.

అగ్నీ! హోతలు నిన్ను నేడు ఆర్షేయ పద్ధతిన వరించినారు.

24. అగ్ని మహా యశోవంతుడు. సమిధ్యమానుడు. వరణీయుడు. హోత అగ్నిని, అన్నదాత ఇంద్రుని యజించును గాత. గాయత్రీ ఛందము శక్తి, సంవత్సరన్నర గోవును సమర్పించి యజించును గాత. ప్రయాజ దేవతా సహితుడై ఇంద్రుడు ఘృతమును సేవించును గాత. హోతర్యజ

25. దైవీహోత తనూనపాత అగ్ని మరియు యజ్ఞ ఫలదాత ఇంద్రుని యజించును గాత. ఉష్ణిక్ ఛందము, శక్తి. రెండేళ్ళ ఆవు అన్నముచే ఇంద్రుని యజించును గాత, ప్రయాజ దేవతా సహితుడై ఇంద్రుడు ఘృతము సేవించును గాత. హోతర్యజ.

26. ఇంద్రుడు స్తుత్యుడు, స్తుతుడు, వృత్రహంత, బలమున సోమసముడు, సోమము వంటి ఆహ్లాదకుడు. అనుష్టుప్ ఛందము, శక్తి, రెండున్నర యేళ్ళ ఆవు, ఆయుష్యములచే హోత ఇంద్రుని యజించును గాత. ప్రయాజ దేవతా సహితుడై ఇంద్రుడు ఘృతము సేవించును గాత. హోతర్యజ.

27. బర్హి శోభాయమానము. పూషాయుక్తము. అమరము. అనశ్వరము. అన్నదాత ఇంద్రుడు బర్హి మీద ఆసీనుడై ఉన్నాడు. బృహతీఛందము, శక్తి, మూడు దూడల ఆవు, ఆయుష్యములచే హోత ఇంద్రుని యజించవలెను. ప్రయాజ దేవతా సహితుడై ఇంద్రుడు ఘృతము సేవించును గాత. హోతర్యజ.

28. ద్వారాదేవేరులు సావకాశలు, సుగమనలు, యజ్ఞ వర్ధికలు, సువర్ణరూపలు. వారిని, అన్నదాత ఇంద్రుని హోత, పంక్తి ఛందము, శక్తి, మూడున్నర ఏండ్ల ఆవు, వయసులతో, యజింతును. గాత. ప్రయాజ దేవతా సహితుడై ఇంద్రుడు ఘృతము సేవించును గాత. హోతర్యజ.

29. ఉషారాత్రులు సుస్వరూపలు, సుకుశలలు, మహిమాన్వితలు, దర్శనీయలు. ఇంద్రుడు అన్నదాత. హోత వారిని, త్రిష్టుప్ ఛందము, శక్తి, మూడేళ్ళ గోవు, ఆయుష్యములచే యజించును గాత. ప్రయాజ దేవతా  సహితుడై ఇంద్రుడు ఘృతము సేవించును గాత. హోతర్యజ.

30. అగ్ని వాయువులు విశిష్ట జ్ఞానవంతులు. ఉత్తమ యశః స్వరూపులు. క్రాంతద్రష్టలు. పరస్పర సంగతులు. వారిని, అన్నదాత ఇంద్రుని, జగతీ ఛందము, శక్తి, ఎద్దు, వయసులతో హోత యజించవలెను. ప్రయాజ దేవతా సహితుడై ఇంద్రుడు ఘృతము సేవించును గాత. హోతర్యజ.

31. భారతి, సరస్వతి, ఇడ దేవేరులు సుస్వరూపలు. సువర్ణ రూపలు. మహా మహిమాన్వితలు. హోత వారి సహితముగా ఇంద్రుని విరాట్ ఛందము, శక్తి, నవగ్రసూత గోవు వయసులచే యజించును గాత. ప్రయాజ దేవతా సహితుడై ఇంద్రుడు ఘృతము సేవించును గాత. హోతర్యజ.

32. త్వష్ట సువీర్యశాలి. పుష్టివర్ధనుడు, రూపధారి. అట్టి త్వష్టను "పృథక్పుష్టిమిన్ద్రం" హోత యజించును గాత. ద్విపద ఛందము, శక్తి, వృషభము, ఆయువులచే హోత యజించును గాత. ప్రజాయ దేవతా సహితుడై ఇంద్రుడు ఘృతమును సేవించును గాత. హోతర్యజ.

33. హవిని సంస్కరించునదియు, శతమఖమును, హిరణ్యవర్ణయు, పగ్గము పట్టునదియు,

